# అంకితం



నా అత్త, మామ గారలు

**శ్రీమతి వేమా మాణిక్యమ్మ,** స్వాతంత్ర్య సమర యోధురాలు

**శ్రీ॥శే॥ వేమా రంగారావు** గార్లకు

అభిమానంతో -

తేది 01-11-2016 **డా॥ నాగినేని భాస్కరరావు**

మధిర

# నగరం నిద్రపోదు

(దీర్ఘ వచన కవిత)

డా॥ నాగినేని భాస్కరరావు

ప్రచురణ



**యువభారతి**

సాహితీ సాంస్కృతిక సంస్థ

(రిజిస్టర్డు నం : 1/64)

తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు

తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001

**NAGARAM NIDRA PODU**
A Long Free Verse Poem
by
Dr. NAGINENI BHASKAR RAO


ALMISN; MBBS; PGDGM; FGSI; FCGPC, MHS (Preventive Cardiology)
5-91, Station Road, Madhira
Madhira (Po), Khammam Dist.

| | | |
|---|---|---|
| *Publication No.* | : | 184 |
| *No. of copies* | : | 500 |
| *First Edition* | : | 6 November, 2016 |
| *Price* | : | ₹ 100 $ 5 |
| *Book Production* | : | 'Pustaka Shilpi'<br>**T. Muralidhar Goud**<br>tmgowd@gmail.com |
| *Cover Design* | : | **Sudhama** |
| *D.T.P.* | : | **T. Mallesh** |
| *Published by* | : | **Yuvabharathi**, Telangana Saraswatha Parishat Buildings, Tilak Road, Hyderabad - 500 001 |
| *Printed at* | : | **Karshak Art Printers**<br>(Multicolour Printers & Designers)<br>40-APHB, Vidyanagar, Hyderabad - 500 044<br>Phone No. 040-2761 8261 |
| *For Copies* | : | **Yuva Bharathi**<br>Telangana Saraswatha Parishat Building,<br>Tilak Road, Hyderabad - 500 001<br><br>**Dr. Nagineni Bhaskar Rao**<br>5-91, Station Road, Madhira<br>Madhira (Po), Khammam Dist.<br>Telangana State Pin: 507 203<br><br>**Nava Telangana Book House**<br>At all its Branches, Telangana State. |



# మా మాట

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక రక్తిక సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమున్నత ప్రమాణాలు గల సాహిత్యం సమాజంలో సామరస్యాన్ని పెంచుతుందన్న సదాశయంతో యువభారతి కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. "చుట్టూరా ఆవరించుకుని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్నదీపాన్నయినా వెలిగించడం మంచిది" అన్న ధ్యేయంతో సమాజహితం కోసం సాహిత్యాన్ని ప్రధాన సాధనంగా చేసుకుని గత ఏభైమూడేళ్లుగా ఇప్పటి వరకు 183 గ్రంథాలను ప్రచురించింది. ప్రతినెలా మొదటి ఆదివారం మధ్యాహ్నం 2 గంటల నుండి 5 గంటల వరకు నగరకేంద్ర గ్రంథాలయంలో యువత కోసం ఉచితంగా వ్యక్తిత్వ వికాసకార్యక్రమాలను నిర్వహిస్తున్నది. మూడవ ఆదివారం మధ్యాహ్నం 2 గంటల నుండి 5 గంటల వరకు హైదరాబాదు సుల్తాన్ బజార్‌లోని శ్రీకృష్ణదేవరాయ తెలుగు భాషానిలయంలో యువకులలో వచోరీతిని, రచనాపాటవాన్ని, ఆలోచనాశక్తిని పెంపొందించేందుకు ప్రతిభా కార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

డా॥ నాగినేని భాస్కరరావు సహజ కవి, సామాజిక కవి, సమాచార కవి. ఆయన వృత్తి వైద్యం. ప్రవృత్తి సమాజసేవ, సాహిత్యసృజన. ఆయన సుమారు 50 సంవత్సరాలుగా యువభారతి కార్యక్రమాలలో క్రియాశీలకంగా పాల్గొంటున్నారు. యువభారతి సంస్థలో సహసమావేశకర్తగా, కార్యవర్గ సభ్యునిగా, సహకార్యదర్శిగా, ఉపాధ్యక్షునిగా అనేక పదవులు నిర్వహించారు. పుస్తక ప్రచురణలో ప్రముఖపాత్ర వహించారు. ఇతర సంస్థలలోనూ ప్రముఖపాత్ర పోషించిన కళాకారుడాయన. వారి 'మేం' కవితా సంకలనం (సుధామతో కలిసి), వ్యక్తిత్వ వికాసం ఆరోగ్యసూత్రాలు, నవజీవనం, వ్యక్తిత్వ వికాసం సూత్రాలు – సూక్తులు – మున్నగువానిని యువభారతి

ప్రచురించింది. ఇప్పుడు 'నగరం నిద్రపోదు' దీర్ఘకవితను ప్రచురిస్తున్నది. ఇందులో ముఖ్యంగా హైదరాబాదుచరిత్ర, చారిత్రక కట్టడాలు, ప్రముఖ భవనాలు, సంస్కృతి, జీవన విధానం మొదలగు వానిని గూర్చి వారు కవిత్వరూపంలో తెలియజేసారు. వారు వివిధ సంస్థలనుండి అనేక అవార్డులు, సన్మానాలు పొందారు. ఆయన వృత్తి, ప్రవృత్తులలో ఆరోగ్య ఆర్థిక విషయాలను కూడా లెక్క చేయని అభ్యుదయ పథికుడు. వారు ఇంకా ఉన్నత ప్రమాణాలుగల అనేక గ్రంథాలను సమాజానికి అందజేయాలని యువభారతి కోరుకుంటున్నది.

శుభాకాంక్షలతో...

**– మాడభూషి అనంతాచార్య**

అధ్యక్షుడు, **యువభారతి**

# ఆత్మీయంగా నాలుగు మాటలు



మా నాగినేని భాస్కరరావు - ముందుగా సహృదయతగల వ్యక్తి. స్పందించే హృదయం ఉన్న అప్పుడు. మంచి ఆలోచనలు గల వ్యక్తిత్వం. ఇవన్నీ కలిపితే వచ్చేదే ప్రభోవోపేతమైన పనికొచ్చే వ్యక్తిత్వం. మౌలికంగా ఆయన కవి ఆ తర్వాతే వైద్యుడు. వృత్తి వైద్యమైనా ప్రవృత్తి రీత్యా సహృదయుడు. మంచి కార్యకర్త. క్రమశిక్షణ, నిబద్ధత -ఆయన లక్షణాలు. అందుకే మా యువభారతి మూలస్తంభాలలో ఒకరు.

తన అభిమానాన్ని, ఆత్మీయతను చవిచూడనివ్వడం నా భాగ్యంగా భావిస్తున్నాను. అందుకే నాకు కవిత్వంతో పరిచయంలేకున్నా ఓ నాలుగు మాటలు రాయడానికి సాహసిస్తున్నాను.

మా భాస్కరరావు అనేక రచనా ప్రక్రియలలో తన ప్రావీణ్యాన్ని మనకు పరిచయం చేశారు. ప్రక్రియ ఏదైనా సూటిదనం, సామాజిక స్పృహ మన హృదయాలను తాకుతూ ఉంటుంది.

“కవిత్వమొక తీరని దాహం” అంటారు గదా– ‘తీరని’ అనడంలో ‘ఒక అందముంది, అలా కొనసాగుతూనే ఉంటుంది’– అని దాని భావం. ‘తనివితీరదు’ అని దాని అంతరార్థం. విషయమేదైనా, పక్కన పెట్టెయ్యకుండా చదివించగల నేర్పరితనం కవితకు ప్రాణం. ముఖ్యంగా దీర్ఘకవితకు మరీ అవసరం. కవితా ఖండికలలో విషయం, రచనా శిల్పం, ఊరుతుంటాయికనుక, ఒక రకంగా కొంత తేలిక. కాని అదే దీర్ఘ కవిత విషయంలో, అంతస్సూత్రాన్ని కాపాడుకుంటూ, రచనను కొనసాగించాల్సి ఉంటుంది. పాఠకుడికి ముందుగానే విషయం తెలిసిపోతుంది. అయినా, ఉత్కంఠ తగ్గకుండా, ఆకట్టు కుంటూ పోవాలి. ‘నగరం నిద్రపోదు’లో ఆ ప్రయత్నమే జరిగింది.

ఎప్పుడో చదివినవి గుర్తుకొస్తున్నాయి. చాలా ఆనందంగా ఉంది. కవిత్వం పరమావధి అదే కదా !

హైదరాబాదు తనకు బాగా పరిచయం ఉన్న నగరం కాబట్టి ఇక్కడి అనేక ధోరణులను, పోకడలను, ఉద్యమాలను, పోరాటాలను సన్నిహితంగా చూసినవ్యక్తి

కాబట్టి, ముక్కుసూటిగా, నిర్భయంగా కలంపట్టాడు, గళం విప్పాడు, హృదయావిష్కరణ చేశాడు. 'నగరం నిద్రపోదు'– నిజమే! 'జనాన్ని నిద్రపోనివ్వదు' అదీ నిజమే! కానీ, కవి అంతర్యాన్ని అర్థంచేసుకుంటే జనం మేల్కొనాలని, స్పృహతో జీవించాలని, బంగారు భవితను సాధించుకోవాలని, నగరం నిద్రపోకపోతే పోనీ, కాని జనం జాగృతులై జీవించాలని, మంచిని పెంచాలని, సమాజ సౌభాగ్యాన్ని కాంక్షిస్తూ జీవించాలనీ, తాను తన నగరంతో పాటు ఎదగాలని, దేశహితానికి పాల్పడాలని మా భాస్కరరావు ఆరాటం – సుస్పష్టం.

'బంగారు తెలంగాణ'ను సాధించుకోవడానికి ఈ ప్రయత్నం మరో అమృత గుళిక. స్వస్తి.

మా భాస్కరరావు తన బంగారు భవిష్యత్తును నిజం చేసుకోవాలని, కవికి పరిమితులు లేవని మనవి చేస్తూ, మేల్కొని జీవించాలని విన్నవిస్తూ –

మీ

హైదరాబాదు.

**– వంగపల్లి విశ్వనాథం**

సమావేశకర్త, యువభారతి

9493 101 328




'చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని
తిట్టుకుంటూ కూర్చోవడం కంటే ప్రయత్నించి
ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది'
అన్న వాక్యమే యువభారతికి ఊపిరి

# నిత్యజాగృత భాస్కరుడు



నాలుగు వందల ఏళ్ళకుపైగా చరిత్ర కలిగిన హైదరాబాద్ ఎందరినో భాగ్యవంతులను చేసిన భాగ్యనగరం. అదే సమయంలో ఎందరో అభాగ్యులు అణచివేతలకు, దోపిడీలకు, మోసాలకు, ఆధిపత్య ధోరణులకుగురై అలమటించిన నగరం కూడాను.

నిజాం కాలంలో తెలుగు భాషా, సాహిత్యాలు నిరాదరణకుగురై, దొరల ఆధిపత్యానికి, నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాటాలుసాగితే భారతస్వాతంత్ర్యం తరువాత, హైద్రాబాద్ విమోచన జరిగి, ఒక భాషమాట్లాడే వారంతా ఒకచోట కలసివుండాలని భాషాప్రయుక్త రాష్ట్రాలకు తలమానికంగా విశాలాంధ్ర ఆపై ఆంధ్రప్రదేశ్ ఏర్పడగా, అన్నదమ్ముల మధ్యే పొరపొచ్చాలు ఏర్పడేలా పాలకుల వివక్ష ధోరణులు, అసమానతలు, ప్రాంతాలమధ్య అభివృద్ధిలో అసమతుల్యతలు చోటుచేసుకుని అరవైఏళ్ళు అంతరంగంలోనే అతలాకుతలం అయిన పరిస్థితులూ రాజకీయాలే మూలకందంగా రాజుకుంటూ సాగాయి.

ఒకప్పుడు తెలంగాణ సాయుధ పోరాటం జరిగిన నేలమీదే ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఊపిరిపోసుకుంది. కేంద్రంలోని అధికారపార్టీ పలుమార్లు దమన నీతితోనో, కుటిల నీతితోనో అణచివేసే ప్రయత్నాలు, తాత్కాలికంగా ఉద్యమాన్ని నీరుగార్చే సందర్భాలూ ఎదురైనా చివరకు కె.సి.ఆర్ నాయకత్వంలో ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ప్రభంజనమై చెలరేగి 2014 నాటికి దేశంలో 29వ ప్రత్యేక రాష్ట్రంగా తెలంగాణ రూపుదిద్దుకుంది. ఎందరి త్యాగాలో, మరెందరి తెగింపు బతుకులో దీని వెనుక వున్నాయి. తెలంగాణ ఎవరి దయాదాక్షిణ్యాలతోనో వచ్చింది కాదు. పోరాడి ప్రజలు సాధించుకున్నదే ! ఆ ఉద్యమస్ఫూర్తికి మూలాధారనాడి తెలంగాణ రాష్ట్రసమితి. ఎందరో కవులు, రచయితలు, కళాకారులు ఆ నెగడును చివరంలా ఆరిపోకుండా చూశారు.

నిజాం నిరంకుశత్వం నుండి, వలసపాలకుల సర్పపరిష్వంగాల నుండి విడివడి వడివడిగా 'బంగారు తెలంగాణ' దిశగా సాగిపోతున్న ఈ క్రమంనిండా హైదరాబాద్

నగరానికి ఓ కీలకస్థానం వుంది. "భిన్న సంస్కృతులు ఎదిగిపూచిన పొదు" అనిపించుకున్న హైద్రాబాద్ నాటికీ నేటికీ తెలుగుల గుండెకాయ. హైదరాబాద్‌తో విడదీయలేని అనుబంధం ఎందరికో. తెలుగువారు రెండురాష్ట్రాలుగా విడిపోవడానికి హైద్రాబాద్‌ను కేంద్రపాలితప్రాంతం చేయాలనే ప్రతిపాదనలూ వచ్చాయి. హైదరాబాద్ పదేళ్ళపాటు ఉమ్మడిరాజధానిగా ప్రకటిస్తూ రాష్ట్రవిభజన జరిగినమాట వాస్తవమే అయినా, తెలంగాణ రాజధాని హైదరాబాద్ ప్రపంచపటంలో నిలువదగిన విశ్వనగరం హైదరాబాద్.

ఎందరో కవులకు, కథకులకు, చిత్రకారులకు, కళాకారులకు హైదరాబాద్ నగరం స్ఫూర్తి. దేశం నలుమూలల నుండీ వచ్చి నగరంతో ముడిపడిన బతుకులు అనేకం. అంతలా అందరినీ అక్కున చేర్చుకున్న నగరం ఇది. ఎవరు అనుమానించినా భరించింది. ఎవరు అవమానించినా సహించింది. ఎవరు ప్రేమించినా ధరించింది. అదే సమయంలో ఆత్మగౌరవం కోసం పోరాడక తప్పని పరిస్థితులువచ్చినప్పుడు ఉస్మానియా యూనివర్సిటీ తాలూకు యువశక్తితో తెగబడింది. కుల, మతాల కుమ్ములాటలు చెలరేగినా అవి తాత్కాలికంగానే వుండి సమసిపోయే సహిష్ణు వాతావరణాన్ని విస్తరించింది. రౌడీలు, గూండాలూ, కబ్జాదారులు, విధ్వంసకారులు ఎందరు ఎన్నివిధాల బద్నాం చేయడానికి కుట్రలు పన్నినా, గాయపడినా, బలిదానాలు చేయాల్సివచ్చినా మొక్కవోని ధీరతతో మహానగరంగా మహిమాన్వితమవుతూ ఎదుగుతూనేవుంది.

హైదరాబాద్ నగరం మీదా, నగరజీవితం మీదా అపారమైన సాహిత్యం కథల్లో, నవలల్లో, వివిధసాహిత్య ప్రక్రియల్లో రూపొందింది. నార్ల చిరంజీవి 'భాగ్యనగరం' నుండి కుందుర్తి 'నగరంలోవాన' మొదలుకొని మొన్నమొన్నటి కన్నోజు లక్ష్మీకాంతం 'హైదరాబాద్ నానీలు' వరకూ నగరం మీద వచ్చినసాహిత్యం ప్రత్యేకించి పట్టికగా తయారు చేసి పరిశోధనలు చేయాల్సినంతగా వుండేవుంటుంది.

మిత్రుడు డాక్టర్ నాగినేని భాస్కరరావ్ బంగారుతెలంగాణ రూపొందుతున్న ఈ సమయంలో వెలువరిస్తున్న 'నగరం నిద్రపోదు' సంపుటికి ఒక ప్రత్యేకత వుంది. హైద్రాబాద్‌నగరం ఆవిర్భావ, వికాస, పరిణామాలనన్నింటినీ "తారీఖులు, దస్తావేజులు ఇవికావోయ్ చరిత్రసారం" అన్న శ్రీశ్రీ భావన మాటున నగరం అసలు సిసలు నిమ్నోన్నతాలను అక్షరీకరించాడు.

*కవికలం జరిపింది నగర విహంగ వీక్షణం*
*తెలిసింది నగరం నిద్రపోని సంగతి తక్షణం*
*ఈ రచన కాదొక నగరం గైడ్*
*అవుతుంది నగరప్రాంతాల వివిధరకాల స్థితి జీవనాల*
*వచన కవితా కథనం!*

అని స్వయంగా పేర్కొన్నట్లుగా ఈ దీర్ఘరచన హైద్రాబాద్‌నగర స్వరూపస్వభావాలను, ఇక్కడి జీవన సరళులనూ, సాగిన చారిత్రక ఘటనా ఘణుతులనూ అద్దంలో కొండలా చూపిస్తోంది. కవిగా భాస్కర్రావ్ చేసిన నగరజీవన వ్యాఖ్యానవైఖరి ఇది. హైద్రాబాద్‌తో అనుబంధం వున్నకవి. అలాగని నగర సంకీర్తనం ఏమీ చెయ్యడు. నాణేనికి బొమ్మా బొరుసులా నగరంయొక్క మంచి-చెడులు, కష్ట-సుఖాలు, వెలుగు-చీకట్ల పార్శ్వాలను సూటిగా బహిర్గతం చేశాడు. వల్లమాలిన ప్రేమతో ఎక్కడా కల్లబొల్లి కబుర్లు చెప్పలేదు. ఎన్నో ప్రపంచరికార్డులను బద్దలు కొట్టిన నగరం నిజస్వరూపాలను తాను నిర్ద్వంద్వంగా బద్దలు కొట్టిచూపించాడు. నగరపాలక సంస్థ తీరుతెన్నుల మురికిని ఎండగట్టాడు. విద్యపేర, వ్యాపారంపేర, ఆరోగ్యంపేర, భక్తి పేర ప్రబలుతున్న అమానుషాలను, అమానవీయతను నిలదీశాడు.

'నగరం నిద్రపోదు' అనడానికి ఈ కవి ఎన్ని నిద్రలేని రాత్రులు ఆర్తితో ఆకళింపు చేసుకున్నవాడో గానీ ఈ సంపుటిలో తాను అభివ్యక్తం చేసిన నగర దృశ్యాలతో పరిచితిలేని నగరవాసి అంటూవుండడు. హైద్రాబాద్ నగరపౌరుడు ప్రతిపంక్తిలోనూ మమేకం కాగల ఈరచన పరిచితిలేనివారికి సైతం హైద్రాబాద్ స్వరూపస్వభావాలను అద్దంపట్టి చూపిస్తుంది.

*వందల సంవత్సరాల గచతరిత్ర పుటల్లో*
*వేలవేల సంవత్సరాల సంస్కృతీ ఛాయల్లో*
*లక్షల లక్షల విభిన్న మనస్తత్వ విచిత్ర భావనల్లో*
*కోట్లాదిజనుల ఆరాధ్యనగరంగా*
*నిత్యం సత్యంగా శోభిల్లుతూ*
*నగరం ఎప్పుడూ నిద్రపోదు - జనాన్ని నిద్రపోనివ్వదు* అంటాడు.

నగరం భూములు, నగరంవంటలు, నగరం చదువులు, నగరం ఉద్యోగాలు, నగరం హోటళ్ళు, నగరం రహదార్లు, నగరం వాహనాలు, నగరం మురికి, నగరం సంస్కృతి, నగరం దేవాలయాలు, నగరంలో హిందూ ముస్లిం పండుగల ఉత్సవాలు, ఊరేగింపులు, నగరంలో నీటివనరులు, విద్యుత్ తీరులు, నగరంలో గడిచే గంటలగంటల కాలం, నగరం అపార్ట్‌మెంట్లు, నగరం ట్రాఫిక్, నగరంలో పత్రికలు, నగరంలో భాష, గుడులు, జాతరలు, పండుగలు, నగరం ప్రతీకగా నిలిచే చార్మినార్, నగరం మ్యూజియాలు, నగరంలో రవీంద్రభారతి, త్యాగరాయగానసభ వంటి సాంస్కృతిక కేంద్రాలు, గ్రంథాలయాలు, సాహితీసంస్థలు, నగరం ఆస్పత్రులు మెట్రోరైళ్ళు, హుస్సేన్‌సాగర్, ఉస్మాన్‌సాగర్ వంటి జలాశయాలు, వివిధ సేవాసంస్థలు, పునరావాస కేంద్రాలు-ఇలా నాగినేని భాస్కర్రావ్ ఈ రచనలో స్పృశించనిదంటూ ఏదీ లేదంటే అతిశయోక్తికాదు.

ఈ సంపుటిలో 'బ్రతుకుసమరంలో... నగరంలో' అనే అధ్యాయం చదివితే నగరం గురించిన అందమైన భ్రమలున్నవారెవరైనా వుంటే అవన్నీ తొలగుతాయి. "నగరం నిద్రపోదు – జనాన్ని నిద్రపోనివ్వదు" అని ఎందుకంటున్నాడో సుస్పష్టంగా తెలుస్తుంది. నిజమే! హైదరాబాద్ విశ్వనగరంగా అభివృద్ధి చెందాలంటే సంస్కరించుకోవాల్సిన అంశాలు ఎన్నోవున్నాయి.

నగరంలో జీవితాన్ని 'నాకం'గా చేయటాన్కి
అందరిపాత్ర అవసరమని నగరం ఘోషిస్తోంది
నవజీవనానికి నాంది పలకాలని ప్రజలూ యోచిస్తున్నారు

అంటూ నాగినేని 'అన్నిభాషల, అన్నిరాష్ట్రాల, అన్నివర్గాల నిలువెత్తు సంతకం నగరం!' అని తీర్మానిస్తాడు. నగరం నిద్రపోనిదీ, నిద్రపోనివ్వనిదీ 'సదాజీవచైతన్యంతో' నేనంటాడు.

పాఠకుడిని హైదరాబాద్ నగరాన్నంతటినీ చేయిపట్టుకుని, ఓ గైడ్‌లా మాత్రమే కాదు అనుభూతి రసస్పర్శగల ఓవ్యాఖ్యాతలా వుంటూ ప్రయోగింపచేసే రచనం ఇది. నిజమే! పల్లెకవిత్వం అయితే, నగరం వచనం వంటిదే! దేశానికి పల్లెలే పట్టుగొమ్మలు అన్నది ఎంతవాస్తవమైనా, నగర జీవనం బతుకు అభివృద్ధికి సంకేతంగా సంభావింపబడే వైఖరి మనుషుల్లో పాదుకుంటోంది. కవిత్వం వచనమై పరిణమిస్తోంది. అందుకే ఈ వచనకవితకు దీర్ఘతను సంతరించాడు రచయిత.

యువభారతి జంటనగరాల సాహితీ సంస్థగా సాహిత్యచరిత్రలో ఒక బంగారు పుటను కలిగినది. నగర సాహిత్యోపజీవులను తన కార్యకలాపాలతో, సభలతో, పుస్తక ప్రచురణలతో అలరించిన సంస్థ. సమ్యక్‌దృష్టితో రాణించిన సాహితీ సంస్థ. 1974లో సుధామ, డాక్టర్ నాగినేని భాస్కరావ్‌ల 'మేం' కవితా సంకలనం ఒక వినూత్న రీతిలో యువభారతి ప్రచురణగానే వెలువడింది. అభ్యుదయ కాముకుల ప్రశంసలందుకుంది.

వృత్తిరీత్యా వైద్యుడైన భాస్కరావ్ ప్రవృత్తిరీత్యా సమాజహిత చింతనాపరుడైన అవసరమైతే శస్త్రచికిత్సోపకరణ ధారుడైన కవిభిషక్కే! కత్తినీ, కలాన్నీ పదునుగా వాడి సామాజికుల అనుభూతి మాటునో, మార్మికత చాటునో వుండక, నిజాలను నిర్భయంగా వచింపగల వచనకవితాభినివేశం భాస్కరరావుది. ఇటీవలే వానలు ముంచెత్తి బెంబేలెత్తిన నగరంమీద తన కవితాకాంతి కిరణాలతో వెలుగులందిస్తున్న 'నగరం నిద్రపోదు' అంటున్న ఈ రాసే భాస్కరుడికి స్వాగతం పలుకుదాం! ఈ రచన మీ అందరికీ నచ్చుతుందని నా ఆకాంక్ష!

కవిమిత్రుడు డాక్టర్ నాగినేని భాస్కరరావుని మనసారా అభినందిస్తున్నాను.

హైదరాబాద్
29.09.2016

సదామీ

**– సుధామ**

ప్రధాన సంపాదకుడు

**యువభారతి ప్రచురణలు**

(9849 297 958)



# ఈ రచన ఎందుకు?

దేశానికి పట్టుగొమ్మలు గ్రామాలే! ఆహార ఉత్పత్తికి, కుటీర పరిశ్రమలకు ముఖ్య నిలయాలు గ్రామాలు. గ్రామీణ జీవితం నగర జీవితం కన్నా మిన్న. అయితే పట్టణీకరణ వల్ల గ్రామాల జనం నగరాలకు వలసలు వెళ్తున్నారు. "కానీ...ఇప్పటికే తలదాచుకునేందుకు తగిన నీడ లేక, తాగేందుకు పరిశుభ్రమైన నీరు లేక...రవాణా ఖర్చులు భరించలేక.. వర్ధమాన దేశాల్లోని నగరాల్లో 70 శాతం మంది కనా కష్టంగా బతుకీడుస్తున్న తరుణంలో... గ్రామీణ ప్రాంతాల నుంచి మరిన్ని వలసలు పెరిగితే? ఒక మహా మానవ సంక్షోభమే నంటున్నారు నిపుణులు...పరిశీలకులు!" (15/10/2016-నమస్తే తెలంగాణ, తెలుగు దిన పత్రిక)- ప్రపంచ వనరుల సంస్థ నివేదిక హెచ్చరిక.

నగరానికి వలసల్ని నివారించాలి! నగరజీవితమూ, గ్రామీణజీవితమూ సౌకర్యంగా వుండాలి. ఉపాధి అవకాశాలు గ్రామాల్లో నిండుగా వుండాలి. పాలకులు ఉంచాలి! ఈ విషయాన్ని చైతన్యపరచటం, అందరికీ తెలియజేయటం - ప్రతి పౌరుడి, ప్రతి కవి కర్తవ్యం! ఆ ప్రయత్నమే ఈ రచన.

'నగరం నిద్రపోదు' (దీర్ఘ కవిత) రచన అనేక కారణాలవల్ల సుదీర్ఘంగా సాగింది. 'ముంబయికి నిద్రలేదు' అన్న విషయం అందరికీ తెలుసు. కాని "హైదరాబాదు నగరం నిద్రపోదు" అంటూ ఈ రచనకు ప్రేరణ. వేగవంతమూ, మోసపూరితమూ, కాలుష్య పూరితమైన నగర జీవితము గత యాభై సం॥ల నా వ్యక్తిగత నగర జీవితం, మరో ప్రేరణ కీ.శే. కుందుర్తి గారి రచన 'నగరంలో వాన". మరియు రష్యన్ రచయిత రచన 'నగరం' నగరం. లేకపోతే నగర జీవితం నరకప్రాయం "నగరం ఒక మేడిపండు. దాని పొట్టవిప్పితే కష్టాల పుండు" ఈ రచన మంచి, చెడులను పాఠకులకే వదిలేస్తున్నాను.

ఈ రచనను ప్రచురిస్తున్న యువభారతి, (సాహితీ, సాంస్కృతిక సంస్థ) రిజిస్టర్డు నం. 1/64 వారికి ముఖ్యంగా ఆచార్య వంగపల్లి విశ్వనాథం, శ్రీమాడభూషి

అనంతాచార్య, శ్రీ మలపాక పూర్ణచంద్రరావు, శ్రీ ఆమాతి రవీంద్ర మరియు ఇతర 'యువభారతీయుల'కు ధన్యవాదాలు.

పుస్తకానికి ముఖపత్రాన్ని రచించటమేకాక – ప్రధాన సంపాదకునిగా ముందు మాట వ్రాసిన చిరకాల మిత్రుడు శ్రీ సుధామకు శతదా కృతజ్ఞతలు.

పుస్తక ప్రచురణలో సహకరించిన చిరకాల మిత్రులు శ్రీమాడభూషి అనంత, 'పుస్తకశిల్పి' శ్రీతాళ్లపల్లి మురళీధరగౌడ్ గార్లకు కృతజ్ఞతలు.

నా జీవిత చరమాంకంలో కూడా – నా రచనా వ్యాసాంగాన్ని భరిస్తున్న నా కుటుంబ సభ్యులు శ్రీమతి శారదాంబకు, కుమారులు డా|| భారతికి, ఫణి భరత్‌లకు – విశ్వసపూరిత ఆశీస్సులు.

ఈ పుస్తకానికి డి.టి.పి. చేసిన శ్రీ టి.మల్లేశ్ గారికి, ప్రచురించిన కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్ వారికి నా ధన్యవాదాలు.

ఎందరో మహానుభావులు అందరికీ వందనాలు!


– డా|| నాగినేని భాస్కరరావు

95812 91736

1-11-2016

ఎ-202, డాక్టర్సు క్వార్టర్సు

యం. యన్.ఆర్. మెడికల్ కాలేజి ఆస్పత్రి

సంగారెడ్డి పోస్టు & జిల్లా, తెలంగాణ రాష్ట్రం. 502 294



# యువభారతి

## సాహితీ సాంస్కృతిక సంస్థ

# ఆహ్వానం

**డా॥ నాగినేని భాస్కరరావు** రచనలు
**'చారవ', 'నగరం నిద్రపోదు'** గ్రంథాల ఆవిష్కరణ సభ

సభాస్థలి: **నగరకేంద్ర గ్రంథాలయం,** చిక్కడపల్లి, హైదరాబాద్.

సమయం: 06-11-2016, ఆదివారం సా॥ గం. 4-00 లకు

| | | |
|---|---|---|
| ముఖ్య అతిథి | : | న్యాయమూర్తి **శ్రీ ఎ. రామలింగేశ్వరరావు**<br>ఉమ్మడి ఉన్నతన్యాయస్థానం, హైదరాబాద్. |
| సభాధ్యక్షులు | : | **శ్రీ మాడభూషి అనంతాచార్య**<br>అధ్యక్షులు, యువభారతి |
| విశిష్ట అతిథి | : | **శ్రీ పుతుంబాక శ్రీకృష్ణప్రసాద్**<br>మాజీ అధ్యక్షులు, ఆం.ప్ర. కోళ్ళు మాంసం అభివృద్ధి సంస్థ |
| 'చారవ' ఆవిష్కర్త | : | **శ్రీ కె. శివారెడ్డి,** ప్రముఖ కవి<br>కేంద్ర సాహిత్య అకాడమి పురస్కార గ్రహీత |
| 'నగరం నిద్రపోదు' ఆవిష్కర్త | : | **ఆచార్య వంగపల్లి విశ్వనాథం**<br>సమావేశకర్త, యువభారతి<br>ప్రముఖ వ్యక్తిత్వ వికాస నిపుణులు |
| అంకిత స్వీకర్తలు | : | **'చారవ'-శ్రీ మాడభూషి అనంతాచార్యులు**<br>**'నగరం నిద్రపోదు'- శ్రీమతి వేమా మాణిక్యమ్మ**<br>స్వాతంత్ర్య సమరయోధురాలు |
| 'చారవ' సమీక్షకులు | : | **శ్రీ తంగిరాల చక్రవర్తి**<br>ప్రముఖ విమర్శకులు |
| 'నగరం నిద్రపోదు' సమీక్షకులు | : | **డా॥ సూర్యదేవర జతిన్‌కుమార్**<br>భారత్-చైనా మిత్రమండలి సంయుక్త కార్యదర్శి |

**సహృదయులందరికీ ఇదే మా ఆహ్వానం**

**- యువభారతి**

# నగరం నిద్రపోదు

నగరమంటే - జనాలకు - కళ్లముందు
మిన్నంటే బహుళంతస్థుల భవనాలు
వాటి ముందే మట్టినంటి పెట్టుకునే పనివారల గుడారాలు
విశాలమైన రాజ మార్గాలు -
వాటిపై రద్దీగా ఖరీదైన మనుషులతో తిరిగే
నాలుగు, మూడు, రెండు చక్రాల వాహనాలు
అప్సరసలను మించిన సౌందర్యంతో ఆఫీసుల్లో,
బ్యాంకుల్లో, స్టూడియోల్లో తిరిగే అందగత్తెలు
స్వర్గానికి బెత్తెడు దూరంలో నగరం వుంటుందన్న -
ఊహల్లో తేలియాడే పల్లె, పట్నవాసులు
ఇక చెల్లని పాతకాలపు కాసులు !

❋ ❋ ❋

నగరం ఎప్పుడూ గరం గరం
నగరం ఎప్పుడూ మేల్కొనే వుంటుంది
తన శరీరంలో అన్నికణాలు చైతన్యమై
తన జాగ్రదవస్థలో తుళ్లుతుంది.
నగరం ఎప్పుడూ నవ్వుతూ వుంటుంది.
తరతరాల తరగని ఆస్తులతో
నవతరపు వ్యాపారపు జిత్తులతో
సంపాదించిన ధనంతో - నిషా, కుషీలతో
నగరం ఒకవైపు తుళ్లుతూ, దొర్లుతూ వుంటుంది.
పాయలు, పాయలుగా నలువైపులా విస్తరిస్తూనే ఉంది.

❋ ❋ ❋

వందల సంవత్సరాల గత చరిత్ర పుటల్లో -
వేల వేల సంవత్సరాల సంస్కృతీ ఛాయల్లో -
లక్షల, లక్షల విభిన్న మనస్తత్వ విచిత్ర భావనల్లో -
కోట్లాది జనుల ఆరాధ్య నగరంగా
నిత్యం సత్యంగా శోభిల్లుతూ
నగరం ఎప్పుడూ నిద్రపోదు - జనాన్ని నిద్రపోనివ్వదు !

❄ ❄ ❄

గడ్డి మొలచిన కోట గోడలు
బీటలు వారిన ప్రహరీలు
ఆనవాళ్లుగా మిగిలిన కట్టడాలు
ప్రభుత్వం దృష్టికి రాని ప్రాచీన కట్టడాలు!
ఎటు చూస్తే అటు - పారేసిన చెత్త చెదారాలు
పాపం - గ్రామాల నుండి వచ్చే పౌరులకు అద్భుతాలు !!

❄ ❄ ❄

నగరం శరీరం నిండాపడ్డ మాయనిమచ్చలు
నిజానికవి ఆనాటి రాచరికపు జీవితాల గుర్తులు -
నిజానికవి శీతవాతాతపములకోర్చి నిలచిన జీవితాల బెండ్లు!
నిజాంపాలకుల ఔన్నత్యపు శిఖరాగ్రాలు-
పాత తరపు తాతలిచ్చిన స్థిరాస్తులు నగరానికి.
నగరం సగర్వంగా జెప్పుకునే చారిత్రక కట్టడాలు, ప్రదేశాలు.
పక్కా హుక్కా కాలపు నగరవాస్తుకు అలంకారాలు.

❄ ❄ ❄

జట్కానుండి-
నేడు రాజీవ్ అంతర్జాతీయ విమానాశ్రయంతో-విమానాలతో-
క్రమక్రమాన పెరిగిన నగరం ఛాయలు ఎన్నో!
మూసీ నది తీరపు-

సారవంతమైన భూముల పంటలు-
'ఖవాలీ' కార్యక్రమ ఘనాపాటీ గంటలు-
'మెహిందీ' మెరపుల్లో కురిసిన శృంకారక్రీడలు.....
నగరం శరీరంపై ఎప్పటికీ మాయని చారలై-
నగరం అంతా నవదారులుగా పాకిన.....
నగనాగరికత పేరిట చెలరేగిన విచ్చలవిడితనపు కోరలు!
ఫిల్మ్‌నగరై, బాలానగరై, దిల్‌షుక్‌నగరై, శంషాబాదై, టోలీచౌకై-
టోకుగా-తన రోడ్ల నరాల ధారాళంగా ప్రవహించిన ప్రవాహాలు!!
నగరం నిద్రపోదు-జనాన్ని నిద్రపోనివ్వదు!

ప్రపంచ ప్రఖ్యాత ఉస్మానియా విశ్వవిద్యాలయం
ఉన్నతంగా నిల్చుంటే-
నాడు విద్యార్థి సమూహాలు జ్ఞాన సముపార్జకులై-పట్టభద్రులై-
ప్రపంచాన పలుదేశాలకు వెళ్లిన విజ్ఞానదీపాలై, శాస్త్రవేత్తలై-
పేరుగాంచారు-వేరుగా నిల్చారు! నగరాన నక్షత్రాలై వెలిసారు!
నేడు-
చదువుల సంగతి ఎలావున్నా-
ఉద్యోగాలు రాకున్నా-
ఉపకారవేతనాలు లేకున్నా-
ఆహార పదార్థాల సరఫరా సక్రమంగా లేకపోయినా-
"తెలంగాణ రాష్ట్ర సాధన"లో-
సమర ప్రాంగణంలో
పోలీసుల విచ్చలవిడి ప్రవర్తనకు గురియై
పారామిలటరీదళాల పశుబలాలకు బలై-
ఆంధ్రపక్షపాత పోలీసు ఆఫీసర్ల దౌర్జన్యాలకుగురై-
మొక్కవోని పోరాట పటిమలో-
విద్యార్జనలతో పాటు-
పోరాట విజయానికి-
వీరులై నిలిచారు విద్యార్థులంతా

ధీరవనితలై నిలిచారు విద్యార్థినులంతా
'తెలంగాణతల్లి'ని వీరమాతను చేసారు
తాము కొందరు అమరవీరులై!
'బాంచెను దొరా' కాలంనుండి-
కాల్మొక్కుతా విడిచిపెట్టండి"-దారినుండి
నైజాం నిరంకుశపాలనకు ఎదురొడ్డిన అమరవీరులు-
తెలంగాణ సాయుధరైతాంగ పోరాటయోధులు-
"చిల్లరదేవుళ్ళ" నుండి-ప్రజల్ని కాపాడినారు-
తిరిగిప్రజా పంథాలో నడిచారు-
కొమరం భీం, చాకలి ఐలమ్మలకు వారసులైనారు!
తెలంగాణ తల్లికి అత్యంత ముద్దుబిడ్డలైనారు!!

కవికలం జరిపించిన నగర విహంగవీక్షణం
తెలిసింది నగరం నిద్రపోని సంగతి తక్షణం!
ఈ రచన కాదొక నగరానికి గైడ్-
అవుతుంది నగర ప్రాంతాల వివిధరకాల స్థితి,
జీవనాల వచన కవితా కథనం!

❄ ❄ ❄

ఒకప్పటి భాగ్యనగరం-
భాగమతి జ్ఞాపకార్థం పుట్టి పేరుతెచ్చుకున్న నగరం!
ఇప్పటి హైదరాబాదు-సికిందరాబాదులు-
మారినకాలాన నిల్చిన పేర్లు-
'బన్‌రోటీ, ఇరానీ చాయ్' నుండి
'ఇడ్లీ, సాంబార్-అల్లంచట్నీ-కారప్పొడి",
దోసె, వడ, పూరీ, బజ్జీ-పిజ్జాలు ఫాస్ట్‌ఫుడ్స్‌వరకు-
జొన్న రొట్టెలు, ఉలవచారు నుండి జుంటితేనెలవరకు-
కల్లాకపటంలేని తనం నుండి; కల్తీ, నయవంచనలవరకు-
ఇదేమంటే- 'నీదే తెలివితక్కువతనం' అన్న సమాధానం!

గుర్రపుడెక్కల సందడి పహారానుండి-
రాపిడ్‌ఫోర్సు-బ్లాక్‌టైగర్ల సంరక్షణ వరకు-
నగరం నడిచి, నడిచి నాల్గుదిక్కులకు పరుగెత్తింది-ఒళ్లు విరుస్తూ.
మెట్రోబస్సులు, మెట్రోరైళ్లు-నేటిరవాణా సౌకర్యాలు!
చాలీచాలని జాగాలో-బొటాబొటి సంపాదనలో-
ఎనభైశాతం నగరం ప్రజలు-త్రిశంకు స్వర్గంలో!
నగరం ఎన్నో ప్రపంచ రికార్డులను బద్దలు కొట్టింది.
ఎక్కడ చూసినా-అక్కడ మురికి నిల్వల కాల్వలకథలే
స్వచ్ఛ హైదరాబాదు-ఒక కలే!
ఎప్పుడు విన్నా-ఎంతవిన్నా నగర పాలనల వింతలే!
నగరపు పౌర సరఫరాలు సదా అరకొరల పాలే!
నగరం నిత్యం-శబ్ద, తీర్థ, కాలుష్యాల పాలు!



'తెలుగుజాతి ఒక వెలుగు జాతి" అంటూ-
'తెలుగుభాష దేశభాషలందు లెస్స' అన్నవాళ్ళు-
బలవంతాన తెలంగాణను కలిపాక-
ఆంధ్రప్రదేశ్ అవతరణ తరువాత-
పాలకులు-తెలుగుభాషను
దేశభాషలందు తక్కువ (Less) చేసారు-
అమాయకత్వం మధ్యకు గడుసుదనం చేరింది.
దాని పెళుసుదనాన్ని-గడుసుదనాన్ని
పిసరు, పిసరుగా చొప్పించి తిష్ఠవేసింది.
తిరకాసు చేసింది-అమాయకత్వాన్ని తిప్పలుపెట్టి-
దాన్ని అంగుళమైనా కదల నీకుండా-
తాను మాత్రం కోసులుకోసులు నడిచింది-
అమాయకత్వం మొదట తడబడింది-మధ్యలో నిలబడింది-!
చివరకు తిరగబడింది-గడుసుదనాన్ని నిలదీసింది!
తనపాలన తనకు కావాలన్నది.

తన బిడ్డల్ని ఎందరినో ఆ పోరాటంలో పోగొట్టుకుంది!
నగరానికివేవీ పట్టలేదు-
గుట్టలు, కొండలు, లోయలు-చదునయ్యాయి
చలువరాతి మేడలు వెలిసాయి-
నయాకుబేరులకు నీడలయ్యాయి.
తమ చేలు అమ్ముకుని-
తనచేలోనే కూలీపనికి కుదిరింది అమాయకత్వం!
గడుసుదనం తెలివితేటలకు దిమ్మతిరిగినా-నెమ్మదిగా తేరుకుంది.
తన భూములు తనకు కావాలన్నది-తనవనరులు తనక్కావాలన్నది.
నగరం అందులో భాగమన్నది!
నగరం-నిరంతరం-ధర్నాలకు-బంద్‌లకు-
ఒకేలా స్పందించింది.
ఒకేలా నవ్వింది-ఒకేలా ఏడ్చింది-
కబ్జాదారుల చేతుల్లో విలవిలలాడి పోయింది-
ఆంధ్రుల సంకుచిత పాలనలో ఎనలేని నష్టపడింది!
నగరం నడిబొడ్డు ఆబిడ్సుకు అన్ని వైపులా
అందంగా, అర్థవంతంగా, అవినీతికి పరాకాష్ఠగా
కిలోమీటర్లు...కిలోమీటర్లు.....
బెంగుళూరు, ముంబయి, చెన్నయి,
విజయవాడ, శ్రీశైలం, వరంగల్లు-రోడ్లు
చుట్టూ-పెట్టుబడిదారుల పొట్ట చుట్టులా
బయటి ఉంగరం రోడ్లు-గడుసుదనం మింగిన కోట్లు!
మధ్య, మధ్య ప్రజల్ని పీడిస్తూ-టోల్‌గేట్లు
రోడ్ల మధ్యనో, పక్కనో మెట్రోరైలు లైన్లు-
కంట్రాక్టర్లకు-తాబేదార్లకు కమీషన్లు-
యితర ఖర్చులు-అన్నీ సామాన్యులపైనే-పన్నుల రూపాన.
సంపన్నులు తప్ప-మిగతావాళ్లు కష్టాలకూపాన!

❋ ❋ ❋

నగరం శరీరంలో మురికి కాల్వల సిరలు-మంచి నీటి పైపుల
ధమనులు-కరెంటులైన్ల వైర్లు-
నగరాన్ని అందంగా ఉంచాలన్న
పరిపాలకుల నిలువెత్తు ఫోటో పోస్టర్లు-
ప్రజలకు ఎక్కడా అందుబాటులో ఉండని-
'సులభ్' కాంప్లెక్సులు'-
సగటు జీవులకు మూత్రవిసర్జనకు ఉండవు సదుపాయాలు ఎక్కడా
అందుకే అక్కడక్కడా గోడలకు, చెట్లచాటున మూత్రవిసర్జన
మూత్ర వాసనతో-పాదచారులకు శిక్ష!
రోడ్లకిరువైపులా-చెత్త, చెదారాలకు-పగిలిపోయి,
మురికివాసన కొట్టే-టాంకులు
నిజానికవి నగరపాల(కుల)క సంస్థ ముఖానికున్న మచ్చలు.
పలురోగాలను మోసే రోగకారకాల నిలయాలు-
నిజానికవి అడుగడుక్కూ నిలచివున్న-ఘన, వ్యర్థ కాలుష్యాలు-
నేటి మురికి రాజకీయాలకు నికార్సయిననేస్తాలు-
సగటు జీవికవి ప్రాణాల్ని హరించే కాలకూట విషాలు!
సగటు జీవికవి క్షణక్షణం వెన్నువిరిచే కాలుష్యాల కారకాలు!
వర్షంవస్తే-రోడ్లన్నీ జలమయం
వాహనాలు నిలుస్తాయి-ఆలస్యం రాక్షసుడు బయటకువస్తాడు.
వాననీరు, వ్యర్థకాలుష్య(కారకాలు) జలం
మంచినీటి పైపుల్లోకి జొరబడతాయి.
నగరం నెత్తిన-కామెర్లు, నీటి/బంక విరేచనాలు.
మలేరియా, టైఫాయిడ్, వైరస్ జ్వరాల కత్తులకట్టి!

❋ ❋ ❋

నగరంలో ఒకచోట-భారత సంస్కృతి పేరిట-ఉపన్యాసాలు-
భక్తి, శ్రద్ధలతో శ్రోతలు-వారిబంధువులు, భ్రాతలు!
"అంతావేదాల్లో ఉన్నాయట-'లేనిదేమీలేదట'-
బీదరికం, ధనవంతం అంతా పూర్వజన్మ ప్రారబ్దం.

ఒకడు పల్లకీలో వుంటే–మోసేది నలుగురు!
కాపు పంట పండించాలి–వైశ్యుడు వ్యాపారం చెయ్యాలి!
– క్షత్రియుడు!–సంరక్షణ చేయాలి,
పంచములు–ఊరికి ఊడిగం చెయ్యాలి! అంటూ ఒకరూ!–
'వేదాల్లో ఎక్కడా కులంలేదు–అంతా కృషిచేయాలి!
వృత్తిని బట్టి–గుణాన్నిబట్టి వ్యక్తులు,వృత్తులు
అందరూ చదువుకోవచ్చు–అందరూ ఎవరికి నచ్చిన వృత్తిని చేపట్టవచ్చు
వేదంలో ఎక్కడా–దేవుడు ప్రస్తావించబడలేదు–
'ప్రకృతి శక్తుల ఆరాధన" గురించే వాటిల్లో చెప్పారు
విజ్ఞానం సమాజానికి ఉపయోగపడాలి
కళలు–సాహిత్యాల పరమావధి సంఘశ్రేయస్సే!
మనుషులంతా సమానమే–
స్త్రీ, పురషులు సమానమే–బాధ్యతల్లో కొద్ది మార్పులు!–
వ్యక్తి ఆరాధన–శక్తి ఆరాధన–వ్యక్తిగతం!
మతాలకు, కులాలకు తావులేని శ్రమైకజీవన సౌందర్యం
అందరికీ ఎప్పుడూ అందాలి–
భాషలెన్నయినా–భావమొక్కటే–
రాగాలెన్నైనా–సంగీత లక్ష్యం–ఆనందాన్ని యివ్వటమే!"
అంటూ మరొకరు మైకులో

❄ ❄ ❄

'అల్లాహో అక్బర్'– ప్రార్థనలు ఒకటోట
'ఆదివారం' స్వస్థత మందిరాల్లో 'యెహోవా ప్రార్థనలు.
ఆయా మతప్రవక్తల ప్రవచనాలు–భక్తుల కానుకల సమర్పణలు
మనిషి సృష్టించిన అనేక మతాలు–వాటిప్రచారాలు–
నగరంలో నలుదిక్కులా నినదిస్తూనే వుంటాయి
నగరం నిద్రపోదు! జనాన్ని నిద్రపోనివ్వదు?
మతమేదైనా–బీదవాడి బతుకెన్నడూ మారలేదు–అన్నది సత్యం–

చర్చిలముందు-చిల్లర మోగిస్తూ రాతెండి కంచాల్తో ముష్టివాళ్ళు-
గుడుల ముందు-మెట్లపైనా, కిందా-
ధర్మం, ప్రసాదం అంటూ అరిచే బిక్షగాళ్లు-
పావురాల రెక్కల రెపరెపలతో మసిలే మసీదుల్లో-
ముస్లింసోదరుల ఖురాను ప్రవచనాల ఆలాపన
అన్నిమతాల్లోనూ సారం-సాటిమానవుణ్ణి ప్రేమించమనే!
కాని-వాస్తవంలో అంతా భిన్నం
అప్పుడప్పుడూ జరిగే మతకల్లోలాలకు, మత సామరస్యతకు సాక్షి నగరం?

❄ ❄ ❄

ఒకచోట-గణేశ నిమజ్జనోత్సవాలు-వాటికి భద్రతా ఏర్పాట్లు
నగరం అంతా రక్షణ దుప్పట్లు-
'మహంకాళి జాతరలు', పెద్దమ్మతల్లి ఉత్సవాలు-
బతుకమ్మ పండుగలు-దసరా వేడుకలు-దీపావళి జ్యోతులు-
మరొకచోట-మొహర్రం వేడుకలు-బక్రీదు జరుపటం
హోళీ కేరింతలు-నగరంలో ఉత్సవాల ఉత్సాహాలు!
మరోచోట-నగరవాసులే కొందరు-
నాగరికత పేరిట-మత్తు బాబులుగా-భామలబానిసలుగా
బడా, బడా వ్యాపారులు-చెడా మడా వారిసంతానం
విలాసంగా-ఖరీదు విల్లాల్లో-రిసార్ట్సుల్లో-
రెచ్చిపోయిన విచ్చలవిడి ప్రవర్తనలు-పోలీసు రైడింగ్‌లు
ఆనక-చెరసాల్లను తప్పించే చదివింపులు-
వ్యాపారానికి, విద్యాభ్యాసానికి పొత్తు కుదరనట్లు-
వ్యసనాలకు, ఆరోగ్యానికి ఆమడదూరం వున్నట్లు-
ఆచరణలేని ఆదర్శాల్లాగ-
చెప్పేమాటకు చేసే చేష్టకు ఎంతో అంతరం!
నగరంలో జీవితాలు పలురకాలు-
నగరంలో జీవితాలు పక్కవాళ్ల పలుకరింతలు లేనివే అన్నీ-!
నగరంలో జీవితాలు నయాపైసా నావపైనే నడుస్తాయి-

పైసాలేనివాడు-నగరంలో ఒక నికృష్ట జీవి
కండా, చర్మంలేని ఒక అస్థి పంజరంలాంటి మానవాకారం!



ఒకచోట-ప్రసిద్ధ హిందూ మతధర్మ ప్రచారకులు చెప్తున్నారు
'ఆహారం అన్ని జీవులకు అవసరం!'
'అన్నం పరబ్రహ్మం'- 'ఆహారం లేకుండా ఏ మనిషీ ఉండడు'-
'ఆహారం చేసుకోవటం-చేయటం తినటం'-
అన్నీ కొన్ని పద్ధతులకు లోబడివుండాలి.
ఆహారం తయారు చేసేవాళ్లు పరిశుభ్రంగా వుండాలి-
పరిశుభ్రమైన ప్రదేశంలో, పరిశుద్ధ పాత్రలతో-
"ఈ మేము వండిన ఆహారాన్ని తినేవాళ్లు ఆనందంగా తినాలి"-
అన్న ఉద్దేశంతో-
తయారు చేయాలి ఆహారాన్ని ఎంతో రుచివంతంగా!"
ఆహారం తినేటప్పుడు-తినేవాళ్లు-కాళ్లు, చేతులు శుభ్రపరచుకుని-
నేలమీదో లేక పట్టామీదో కూర్చుని
పరిశుభ్రమైన పాత్రలో-తాగే నీటిని సమకూర్చుకుని-
సరిగ్గా-నెమ్మది, నెమ్మదిగా-నమిలితినాలి-
ఆహార పదార్థాలను కావలిసినంతగా మాత్రమే పెట్టించుకుని తినాలి-
ఆహారాన్ని వ్యర్థం చేసేవాళ్లు-పరబ్రహ్మను అగౌరవపరచేవాళ్లు!
సంపూర్ణ ఆహారం మనిషికి ఆరోగ్యాన్నిస్తుంది
శారీరక ఆరోగ్యం-మానసిక ఆరోగ్యాన్నిస్తుంది.
మానసిక ఆరోగ్యం-మనిషికి సరైన ప్రవర్తనను.
సరియైన ప్రవర్తన-
అతని ఆమె జీవితాన్ని సాఫల్యంచేస్తుంది!
సఫలమైన జీవితంలో ఎక్కువ సుఖసంతోషాలుంటాయి-
కనుక ఆహారం పట్ల అంతా తగినశ్రద్ధ, గౌరవం కనపరచాలి!"
అలా ఆహారం గురించి అనర్గళంగా అతని ఉపన్యాసం!!

కాని-
నగరంలో-అయిదునక్షత్రాలహోటళ్లు మొదలుకొని-
చక్రాలబండి హోటలువరకు-రోడ్డుప్రక్క
వినియోగాదారులు విసిరి పారేసే ఆహారపదార్థాలు కుళ్లి-
నగరంలో అనేకచోట్ల కంపుకొడుతుంటాయి
పందులకు, పందికొక్కులకు, కుక్కలకు నిలయాలు అవుతాయి.
కుళ్లిన ఆహారపదార్థాలు మురికి కాలవల్లో పడి
నగరంలో కొన్నిచోట్ల-అంటురోగాలు సృష్టిస్తాయి-

నగరంలో-కొన్ని చోట్లయినా-అన్నివేళల్లో ఆహారం దొరుకుతుంది!
అందుకే-అన్నం పరబ్రహ్మం, అందరికీ!
"ఆహారాన్ని గౌరవిస్తే-అందరినీ గౌరవించినట్లే"
ఆహారాన్ని సరిగ్గా తింటే అందరూ ఆరోగ్యంగా వుంటారు!
డబ్బుకన్నా ఆహారమే ముఖ్యం-
ఎందుకంటే ఆరోగ్యమేమహాభాగ్యం!!
పరిశుభ్రతే కులం-ఆరోగ్యమే మతం!!!
నగరంలో కావాల్సినవీ అవే-తగినంతగా దొరకనివీ అవే.

❋ ❋ ❋

నగరంలో నీరుకన్నా బీరు సరఫరా బాగు బాగు!
నగరంలో నీరు-కొందరికి దొరకనీయరు
నగరంలో నీరు-కొన్నిచోట్ల ఇరవైనాలుగు గంటలు
నగరంలో నీరు-కొన్నిచోట్ల రెండు రోజుల కొకసారి!
నగరంలో తామరతంపరలా పెరుగుతున్న
అపార్టుమెంట్లకు సరిగ్గాఅందనిది నీరే!
నగరంలో తాగునీరు-అతిఖరీదు-
అంతకన్నా కారుచౌక కల్లుసీసా!
నగరంలో తాగునీరు-రకరకాలతీరు
నగరంలో తాగునీరు కాదుకాదు కలుషితరహితం-

నగరంలో తాగునీరు పారిశ్రామిక వ్యర్థజలాల కాటుపాలు!
ఎప్పుడూ నగరంలో తాగునీరు ఎప్పటికీ తీరని కరువే-
అది వేస్తుంది నగరవాసుల దాహం వీపుమీద ఆగని దరువే!



నగరం ప్రతివీధిలో వరుస విద్యుత్ దీపాలుంటాయి
చీకటిని చీలుస్తూ వెలుగులు ప్రసరిస్తుంటాయి-
నగరం కనుక తన హోదాతో గర్వంగా విద్యుత్తు కోత లేకుండా వుంటుంది!
ఒక్కోచోట రాత్రయినా పగలున్నట్లే వుంటుంది-
వానొస్తే, వరదొస్తే మాత్రం నగరంలో సైతం
కొన్ని గంటలు చీకటి తప్పదు!
చెట్లు విరుగుతాయి-కేబుళ్లు పాడవుతాయి-తీగలు గతి తప్పుతాయి-
కొన్ని గంటలు నగరం ప్రజలు విద్యుత్తులేక కాలం గడుపుతారు
కొన్ని గంటలు తిమరంతో/లో సమరం జరుపుతారు మరికొందరు-
కొన్ని గంటలు కొందరు కుదిరినచోట్ల దొంగతనాలు చేస్తారు-
కొన్ని గంటలు-కొందరు కుర్రకుంకలు కలలు కంటుంటారు-
కొన్ని గంటలు-కొందరు అసంబద్ధ, సంబద్ధ సృష్టికార్యంలో మునుగుతారు
కొన్ని గంటలు కొందరు విజృంభించిన దోమలతో యుద్ధాలు చేస్తారు
కొన్ని గంటలు కొందరు భయం, భయంగా బ్రతుకుతారు.
కొన్ని గంటలు కొందరు కారుచీకటి పుణ్యమా అని
వస్తువులను రవాణాచేస్తారు.
కొన్ని గంటలు కొందరు వెలుతురు లేక ప్రమాదాల పాలవుతారు!
కొన్ని గంటలు కొన్ని చోట్ల-చిన్నా, చితకా పరిశ్రమలు మూత పడతాయి.
కొన్ని గంటలు కొందరు కొన్ని చోట్ల చలిమంటలు వేస్తారు-
కొన్ని గంటలు-కొందరు చీకటిలో మగ్గిపోయి
'వెలుతురు'ను గుర్తుకు తెచ్చుకుంటారు.
కొన్ని గంటలు-ఊర్లబయట నక్కల ఊళలు-
కొన్ని గంటలు ఎన్నోచోట్ల సాధారణ జీవనస్థంభనం!

కొన్ని గంటలు–కొన్ని జీవాలకు ఆటవిడుపు–
కొన్ని గంటలు–ఎన్నో చోట్ల
రవాణా సంస్థల వాహనాలు ఆగిపోవటాలు.
కొన్ని చోట్ల కొన్ని గంటలు చీకటివచ్చి–వెలుతురును పెద్ద చేస్తుంది–!

విద్యుత్తు–మానవాళికి కావాల్సిన నిత్యావసరశక్తి
విద్యుత్తు–అనేకరూపాల్లో పుట్టినా
అనేక రూపాల్లోనూ ఉపయోగకారి!
విద్యుత్తు–బాగాసరఫరా వుంటే ప్రతిరాత్రీ–పగలే!
విద్యుత్తు–రైతన్నలకు, పారిశ్రామిక వేత్తలకు–ఒక తోడూ–నీడా
నగరంలో విద్యుత్తు జనులకు సర్వజగత్తు!. ఒక విద్యుత్తు!!
నగరంలో విద్యుత్తు వుంటే నయం–పోతే భయం–
నగరంలో పాతాల, భూతల, గగనాలకు విద్యుత్తు ఒక సత్తువ!
నగరంలో కోతల్లేని విద్యుత్తుతో–పగలే వెన్నెల–జగమేమాయ!

❋ ❋ ❋

నగరంలో సిమెంటు చెట్లలా అపార్టుమెంట్లు–
అపార్టుమెంట్లలో పక్షిగూళ్లలాంటి పోర్షన్లతో ఫ్లోర్లు నాలుగు–
గాలిలేక ఉక్కపోతతో విలవిల్లాడే పక్షుల్లా ప్రజలు–తలుపులు వేసుకొని,
ఎవరిగూట్లో వాళ్లు–ఎవరి ఫ్లాట్లో వాళ్లదే ప్రపంచం!
సహజీవనంలో–ఏకాంతవాసం!!
పక్కవాళ్లతో పలుకరింపులు ఎక్కువగా ఉండని–మరో ప్రపంచం!!
వనంలో చెట్లమీద గిజిగాడు(చిన్నపక్షి)–ఎక్కడెక్కడి నుండో వెదకి, వెదకి–
మెత్తని, సన్నని ఎండిన గడ్డిపరకలు–నోటకరచి, తెచ్చి–
ఏర్చి, కూర్చి, మెత్తని–వేలాడేగూడును కట్టుకుని వెచ్చగా, స్వేచ్ఛగా ఉన్నట్లు–
నగరపు వీధుల్లో అపార్టుమెంట్లు సిమెంటు చెట్ల కొమ్మల్లాంటి అరల్లో–నగరజీవులు!
నీళ్లకోసం, నిత్యావసర వస్తువులకోసం–
నిత్యం పెత్తందారీ ప్రభుత్వాలతో పోరాటంచేస్తూ–
ఘన, ద్రవ, వాయు పదార్థాల కాలుష్యం కోరల్లో చిక్కి–చిక్కిపోయి–

పాలక పక్ష రాజకీయ నాయకుల వాగ్దానాల అమలుకునోచుకోని
పథకాల కోసం ఎదురుచూస్తూ-రోడ్డుపైకి వస్తే-
ఎప్పుడు, ఎక్కడ ఏ వాహనదారుడు ప్రమాదం కల్గిస్తాడోనని-
కొన్నిచోట్ల-ఎవరు మెడపై కత్తిపెట్టి మంగళ సూత్రాలో,
ఏ గొలుసో ఎత్తుకుపోతాడేమోనని
ఏ హోటలు కెళ్తే-ఎక్కడి కల్తీ సరుకులతో వండిన-
నిల్వవుంచిన ఆహార పదార్థం పెడతాడోనని
రోజువారీ నిబంధనల మేరకు కేసులకోసం ట్రాఫిక్ పోలీసులు-
తమ వాహనాలను ఆపి జరిమానా విధిస్తారేమోనని-
ఏకచక్ర, ద్విచక్ర, త్రిచక్ర, చతుశ్చక్ర వాహనదారులు.
ఉదయం ఐదు గంటలకు లేచి-
మరోగంటలో ఫలహారం, మధ్యాహ్న భోజనం పట్టుకుని-
కంపెనీ బస్సులోనో, రోడ్డురవాణా సంస్థ బస్సులోనో బయలుదేరి-
ఉద్యోగపు బాధ్యతల్ని మోసి, మోసి-
ఆ నాటికి వాటిని వదలించుకుని-
తిరుగు ప్రయాణంలో 'ట్రాఫిక్‌జాం'తో కుస్తీలు పట్టే
వాహనాల్లో ప్రయాణించి-
పన్నెండుగంటల సమయం తరువాత-
తిరిగి ఇంటికి చేరే చిరుద్యోగులు-ఇతర ఉద్యోగులు-
నగర శరీరాన ప్రవహిస్తున్న చైతన్యపు యోధులు!
జీవితంలో సగాన్ని ప్రయాణాలకే అప్పగించి-
మిగతా సగంలో అప్పులు, భార్యా, పిల్లలు-
వారిపోషణలో మునిగిపోయి-
సౌఖ్యపు ఛాయల్ని ఎప్పుడోకాని చూడని అభాగ్యయోగులు!!
'అంతేలే, మన బ్రతుకంతేలే'-వీధులలో
కుక్కల వలె, పందులవలెనన్నా, జీవించలేమని నిస్పృహతో విరాగులు
పేదరికం, రోగాలు కాటేస్తే మాడిమసయ్యే పేదవర్గ జీవులు-
'ఆరోగ్యం మహాభాగ్యం' రేఖ దగ్గరకు రాలేని
ప్రాణమున్న ఎముకల గూడులు-

'సురాజ్యమని' ఒకడు-'రాజన్న' రాజ్యమని ఒకడు-
'రామరాజ్యమ'ని ఇంకొకడు-'గాంధీజీ కలలుగన్న
గ్రామరాజ్యమ'ని-ఒకడు-అంటూ-
ఓ పేరు పెట్టుకుని 'యాత్రలు' చేస్తున్న అవినీతి పంకిల పార్టీల నాయకుల
పరస్పర-దూషణలు, వాగ్దానాల పరంపరకు
మెదడు పనితీరు పడిపోయి-
నగరంలో సొమ్మసిల్లి పడిపోయిరి పౌరులెందరో?
అందుకే-నగరం ఒక నేతిబీరకాయ.
నగరం ఒక చేదు దోసకాయ-
నగరం ఒక మిథ్య-ఒక మాయ-ఒక ఎండమావి-
అక్కడలేదు సుఖాల ఛాయ-అవసరాల సరఫరాకాయ!
అనారోగ్యపు నగరం ఎప్పుడూ నిద్రపోదు-!
అందమైన నగరం ఉదయించదు
అక్రమ, అసహ్య, అవినీతి కూటమి అస్తమించదు!!
పల్లెల నడ్డి విరిచేసిన నగరం పాకుతున్నది నలువైపులా-
నగరం నిద్రపోదు! జనాన్ని నిద్రపోనివ్వదు.

నగరాన-
జీవితాంతం ప్రశాంతత కోల్పోయి-ఆందోళన పరుగులో
వ్యాయామం, విరామం, శరీరశ్రమలేక
శరీరం-అవుతుంది నిస్తేజం-
అవుతుంది అధిక రక్తపోటు, మధుమేహం,
మానసిక ఆందోళన-రోగాలపాలు!
ఆతర్వాత-వివాహజీవిత ఛిద్రాలు
అసంబద్ధ ప్రణయాలు-అకాలమరణాలు!!

❄ ❄ ❄

నగరం సగర్వంగా-సర్పవేగంతో-
దర్పంగా విస్తరిస్తున్నది-వింతచేస్తున్నది
విజయవాడ రోడ్డుకు-విస్తృత నిర్మాణాలు

మెట్రోరైలు-భారీగా పెరిగిన వాహనాలు
ఎప్పుడూ-తోసుకు, రాసుకు తిరిగే జనంతో
కిక్కిరిసి ఉండే **సుల్తాన్ బజారు**-మహిళా కళాశాల నుండి
ఆంధ్రాబ్యాంక్ ప్రధాన కార్యాలయం వద్ద విగ్రహం నుండి-
పూలు, రకరకాల పండ్లు, కూరగాయలు విక్రయించే స్త్రీ, పురుషులు-
దస్తీలు, సాక్సులు, పెద్ద, చిన్న చిత్రపటాలు, చిన్నచిన్న సామాన్లు 'అగ్గువ',
'అగ్గువ' అంటూ-
అరుస్తూ-అమ్మకాలు సాగించే విక్రయదారులనుండి-
చీరల్లో, పంజాబీ డ్రెస్సులో, టైట్‌పాంట్,షర్టుల్లో
ఎందరో యువతులు-అందాలను విరబోస్తూ-
వారివెంట అనేకమంది యువకులు, వృద్ధులు-పోటీపడుతూ
'సుప్రసిద్ధ' 'గోకుల్‌ఛాట్' ముందు-రోజూ వేలాది మంది.
ఫలహారాలు తింటూ-రంగు రంగుల చిత్రాలను, భామల సౌందర్యాలను,
యవ్వనాలను-చూస్తుంటారు.
అక్కడ-ఫుట్ పాత్‌లమీద-వివిధ రకాల దృశ్యమాలికల పోస్టర్లను,
దేవుళ్ల చిత్ర పటాలను చూస్తూ-
పక్కపక్క వివిధ రకాల-కొత్త, పాతల పుస్తక విక్రయశాలలనుండి-
సుల్తాన్ బజార్ చౌరాస్తా-పలురకాల పండ్ల బండ్ల నుండి-
విజయవాడరోడ్డు-చెన్నయికిదారి-నల్గొండకు దారి-ఖమ్మంకు దారి-
చెరకు రసంబండి-అనాస, బత్తాయి, ద్రాక్ష, ఆపిల్, పండ్ల రసంబండి
ఆపిల్ పండ్ల బండ్లు-అరటి, జామ, బొప్పాయి, ద్రాక్ష పండ్ల బళ్ళు-
అక్కడి బస్సుస్టాపు-దగ్గర్లో వివిధ వైద్యశాఖల రాష్ట్ర ప్రధాన కార్యాలయాలు-
మీదు మిక్కిలి హైదరాబాదు స్టేటు మెడికల్ కౌన్సిల్ నుండి
ఆంధ్రప్రదేశ్ మెడికల్ కౌన్సిల్‌గామారి-
తిరిగి-తెలంగాణ రాష్ట్ర మెడికల్ కౌన్సిల్‌గా మారిన-ఆఫీసుల నుండి-
**ఇండియన్ మెడికల్ అసోసియేషన్ (IMA) తెలంగాణ రాష్ట్ర ఆఫీసు నుండి.**
అందులో షాపుల నుండి-
ఛాదర్‌ఘాటు మీదుగా, కమల్‌టాకీసు, రైల్వేబ్రిడ్జి,
మలక్‌పేట మీదుగా-ఇప్పుడు మెట్రోరైలు లైన్లతో-
రోడ్డు ముందుకు-దిల్‌షుక్‌నగర్-వనస్థలిపురం-హయత్‌నగర్

చౌటుప్పల్-నకిరేకల్, రింగు రోడ్ల మీదుగా-
సీమాంధ్ర విజయవాడకు! తెలంగాణ రాష్ట్ర ఖమ్మం, నల్గొండ జిల్లాలకు
పుణ్యక్షేత్రం భద్రాచలానికి-!



ఒకప్పుడు-సైకిళ్లకు ప్రసిద్ధిగాంచిన నగరం-
ఇప్పుడు మోటారు సైకిళ్లు, కార్లు (ప్రైవేటు),
రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ బస్సులు, లారీలు-
అంతకు మించిన సంఖ్యలో-వివిధ రకాలపేర్లతో-ప్రైవేటు సంస్థల బస్సులు-
అందంగా అలంకరించుకున్న అతివలా-కొన్ని వాహనాలు.
తెలుగుతనం ఉట్టిపడి-తెలుగు పలుకులు విస్తరిల్లి-
తెలుగు వెలుగులు ప్రసరిల్ల నాలుగు దిక్కులా-
తెలుగుజాతి ఔన్నత్యం! తెలుగువాడి ఆత్మగౌరవాలను చాటి చెప్తూ-
ఇప్పుడు తెలంగాణ (ప్రజల) రాష్ట్ర రాజధాని
నగరం నుండి విజయవాడ రోడ్డుకు-ఇరువైపులా ఎన్నో పేటలు! బాటలు!!
అంతర్జాతీయ ఖ్యాతి గడించి-అన్నింటా విజయాలను ఆవిష్కరించి-
చిట్‌ఫండ్స్-అన్నదాత పత్రిక-ఈనాడు దినపత్రిక నుండి
దైనందిన జీవితంలోంచి విడదీయరాని పచ్చళ్ల దాకా-
హోటల్స్ నుండి సినీ పరిశ్రమ దాకా-
పట్టిందల్లా బంగారం చేసిన పట్టుదల వస్తాదు రామోజీరావు-
ఊహించి, నిర్మించిన "రామోజీఫిల్మ్‌సిటీ"- విజయవాడ రోడ్డుకే.
ఉత్సవాలు ఒకవైపు, సినిమా షూటింగ్‌లొకవైపు
ఒకటేమిటి? సమస్త సౌకర్యాల నిలయం-
ప్రపంచ ప్రఖ్యాతి నార్జించిన రామోజీ ఫిల్మ్‌సిటీ
నగరంలో సందర్శించాల్సిన ముఖ్య ప్రదేశం!

అరవవాళ్ల ధాటికి తట్టుకోలేక-ఇంగ్లీషు వాడి దమన నీతిని పూర్తిగా జీర్ణించుకొని-
బాషపేరు చెప్పి-భావాలను చొప్పించి-యాసలు మర్చిపోయి-
తెలుగు వాళ్లకు ఒక రాష్ట్రం కావాలని-

పెద్దమనుషుల ఒప్పందం కుదుర్చుకుని
అమరజీవి పొట్టి శ్రీరాములు బలిదానం మీద
ఏర్పడ్డ ఆంధ్రప్రదేశ్ నెత్తిన సీమాంధ్రులు,
సీమాంధ్ర పాలకులు-తెలివి మీరి-హద్దులు మీరి-
తెలివితక్కువ తెలంగాణ మాగాణిని,
నల్ల బంగారం కాణాచిని-
నగరాన్ని-కొద్దికొద్దిగా ప్రారంభించి-
ఎక్కువభాగాన్ని ఆక్రమించారు! చట్టాలను అతిక్రమించారు!!
చివరకు మాతోనే నగరమన్నారు-మాదే నగరమంటున్నారు!
తేనె(తీ)టీగల్లాంటి తమ్ముళ్లను పక్కదోవపట్టించి, మోసగించి-
తెలంగాణలోని తేనెపట్టుల నందిపుచ్చుకున్నారు!
నయవంచన చేసారు-నయా దొరల రూపమెత్తారు!
తేనెపూసిన కత్తులయ్యారు-సోదరుల గొంతు కోస్తారు-
తెలుగు వాళ్లమంటూ తెలంగాణతల్లికి ద్రోహం చేస్తారు!
తెలుగు వాళ్లమంటూ నగరంలో వేసారుతిష్ఠ-
మాట్లాడుతారు మొదట ఎంతో మర్యాదగ- ఆ తర్వాత-
ఎదుటివాడి బలహీనతల్ని బట్టి మెలగుతారు
వాళ్లని లొంగదీసుకుని దివాళాతీయిస్తారు-ఇది వాడినైజం!
మోసపువ్యాపారాలకు అడ్డాలు-ఎన్నెన్నో-ఎక్కడెక్కడో-
నగరం నిండా-కుష్ఠురోగిపై కురుపుల్లాగ-
అందుకేనేమో-నగరం నిద్రపోదు-జనాన్ని నిద్రపోనివ్వదు!

❄ ❄ ❄

విజయవాడకు యిప్పుడు విలాసవంతమైన రోడ్డు-
తెలంగాణ-సీమాంధ్ర ప్రాంతాలకు మధ్య
విస్తరించబడిన విశాలమైన రోడ్డు-
ప్రభుత్వ రవాణా సంస్థ బస్సులు-
అంతకు మించిన సంఖ్యలో ప్రైవేటు బస్సులు-
చీమల బారుల్లా-లక్షలాది ప్రయాణికుల్ని మోసుకుంటూ-
నగరం నుండి బయలుదేరుతాయి-రకరకాల శబ్దాలు చేస్తూ!

కొన్ని నగరంవైపుకు వివిధ జిల్లాలనుండి-వివిధ రాష్ట్రాల నుండి-
రాత్రంతా గస్తీసైనికుల్లాగ
అలుపెరుగక తిరుగుతుంటాయి-
వెలిగే విద్యుత్ దీపాలతో-నడుస్తున్నయితర వాహనాలతో-వాటి శబ్దాలతో.
రాబోయే రేపటి గురించి ఆలోచిస్తూ నగరజనం-నిద్రపోరు-
జనం ప్రయాణాలతో-యితర కార్యకలాపాలతో-నగరం నిద్రపోదు.
రాజమార్గాలు ఎప్పుడూ మేల్కొనేవుంటాయి వచ్చే, పోయే వాహనాలతో-
నగరం ఎల్లప్పుడూ మేల్కొనే వుంటుంది-మూసీ, మూయని బార్లతో...
కార్లు, బార్లు-కలిగిన వారి సొత్తులు-
డీసిల్, పెట్రోలుతో కార్లు-విస్కీ, బ్రాందీ, బీర్లతో బార్లు!



ఆకాశానికి నిచ్చెనలా వున్న బహులంతస్థుల భవనాల పునాదులు-
అధఃపాతాళానికన్నట్లు-
ఆ భవనాలకు నీరందించటానికి వేసే బోర్లు-
భూగర్భజలాల వేటకు వెళ్లే రకరకాల తీర్లు!
అవకాశానికి ఆనివున్న బహుల జాతి సంస్థలు-
నగరంలో ప్రజలు ఎందరో పడి గిలగిల కొట్టుకున్న మురికిరూపాలు-
నగరంలో జనం మూల్గుల పీల్చేస్తున్న నయవంచనజలగలు-
వాళ్లు-కనపడకుండా చేసే కుట్రల బహిర్గత రూపాలు-
మానవ జీవితంలో-భగవంతుని కర్మపేరిట మగ్గుతున్న శాపగ్రస్థులు-
భగవంతుడిని తిట్టలేక-కారణమైన మనుషుల్ని
ఎదుర్కొనలేక-డబ్బుమాయాజాలంలో చిక్కుకుని-
మేడల ప్రక్క, మిద్దెల ప్రక్క, మురికి కాల్వలప్రక్క-
కుక్కలతో, పందులతో, దోమలతో, దుర్వాసనలతో సహజీవనంచేస్తూ-
శరీరం సహకరించకపోయినా, రుజాగ్రస్తమైనా-
నిరక్షరాస్యతతో, మూర్ఖత్వంలో, అజ్ఞానంలో-
ఒకరినొకరు కొట్టుకుంటూ,-మూల్గుతూ-మూర్ఛలుపోతూ-
బ్రతుకుల్ని మరొకరికి తాకట్టుపెట్టినోళ్లు-

రకరకాలుగా వ్యసన పరులై-మసలుతున్నవేళ-
నగరం నిద్రపోదు-జనాన్ని నిద్రపోనివ్వదు



అప్పుడప్పుడూ-ఎప్పుడెప్పుడా అని ఎదురు చూసే-
ఉత్సవాలు-**మహంకాళి జాతర**,
పెద్దమ్మతల్లి జాతర-వినాయకుల నిమజ్జనము జన శోభాయాత్రా మాలిక!"
బతుకమ్మపండుగ-
గోల్కొండ కోట ఉత్సవం-చిన్నా, పెద్దా, బీదాబిక్కి తేడాలు లేకుండా-
ప్రాంతీయ తత్వాలు-రాజకీయ కక్షలు, మతకలహాలు లేకుండ-
సర్వజనుల ప్రాంతంగా-స్వాంతనతో-సౌభ్రాతృత్వంతో-
నగరం అన్ని ప్రాంతాల, అన్ని రాష్ట్రాల, అన్ని మతాల ప్రజల
సహజీవనయానంతో-
నగరం ఎప్పుడూ మేల్కొనే వుంటుంది-
జనాన్ని మేల్కొలిపే వుంచుతుంది.



విహంగ వీక్షణలో....నగరం....నగరంలో.....నగరం చుట్టూ...

# మహంకాళి జాతర

వర్షాలు కురవాలని, వసుధలో పండాలి పంటలని,
తప్పెట్లు, తాళాలతో చిందులేస్తూ, పాడుతూ కొందరూ-
పులివేషాలతో గెంతులు వేస్తూ కొందరు-
పూనకం వచ్చిన భక్తురాలు ఒకవైపు
నెత్తిన బోణాలు ఎత్తుకుని-మనసున కోరికలెన్నో ఒత్తుకొని-
ఉత్సాహాల రెక్కలతో-రెపరెపలాడుతూ-
ఎందరో భక్తులు-ఆస్తికత్వంశక్తులు-
మంత్రులు-నాయకులు-ప్రజాప్రతినిధులు సైతం-కాళి ముందు-
చేస్తారు సాష్టాంగ దండ ప్రణామాలు-శక్తికి
నిదర్శనం-మహంకాళి దర్శనం!

తన్మయులౌతారు వానల్లో తడిసిన మట్టిలా-
మహంకాళి భక్తులపై కురిపించే మమతల జల్లుకు!
ఆషాఢమాసం చివరలో-అంటే జూలై నెలలో-
తెలంగాణ ప్రజలు జరుపుతారు మహంకాళిజాతర్ని
పాతనగరం లాల్‌దర్వాజ ఆలయంలో పెద్దఎత్తున
మహంకాళి జాతర-బోనాలపండుగ-
"తెలంగాణ యాస దేశయాసలందు లెస్స"గా నమ్మే
తెలంగాణ తల్లి ముద్దుబిడ్డలు-జరుపుతారు ఈ జాతర్ని.
'బోనాల పండుగ, నేడు తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ ఆధికారిక పండుగ!
2014సం॥నకు తెలంగాణరాష్ట్ర తొలిముఖ్య మంత్రి
గౌ॥కల్వకుంట్ల చంద్రశేఖరరావు
"బంగారుబోనం'ను సమర్పించారు.
మంత్రులు, అధికారులు, అన్ని రాజకీయ పక్షనాయకులు,
లక్షల సంఖ్యలో భక్తులు-
అందంగా అలంకరించుకుని నెత్తిన బోనాలతో యువతులు-
అక్కడ శివమెత్తిన 'సత్యవాణి' పలుకుతుంది-
భవిష్యత్తును తెలుపుతుంది!
తమశక్తి కొలది-భక్తి నిలిపి-
పాయసం, పిండివంటలతో-బోనాలతో-స్త్రీలు ఉచిత వస్త్రాలతో-
కోడి,మేక, గొర్రె,బర్రె, దున్నలతో మరి-కొందరు పురుషులు-
కాళిమాత జాలికోసం-
'సింహ వాహిని' మహంకాళి కటాక్షం కోసం-
రకరకాల వాయిద్యాలతో, వివిధ విచిత్రవేషాలతో-
'పోతురాయుళ్లు'గా కొందరు భక్తులు-
'అమ్మ బై లెల్లినాదో'- అంటూ పాటపాడుతూ-
'మైసమ్మ తల్లి', 'పెద్దమ్మతల్లి', 'నల్లపోచమ్మతల్లి'-
అంటూ గ్రామదేవతలను-
స్తుతిస్తూ-పూనకం పూని-చిందులేస్తూ-గంతులేస్తూ-
భక్తజనం జాతరను రక్తి కట్టిస్తారు!

చిల్లర దేవుళ్ల చిట్టా చదువుతూ-
వానలు కురవాలని, పంటలు పండాలని,
కోరికలు తీరాలని ప్రార్థనలు చేస్తారు!
మరోచోట-సికిందరాబాదులో-మహంకాళివీధిలో
మహంకాళి దేవాలయం వుంది!
శుచిగా స్నానంచేసి, శుభ్రమైన బట్టలు ధరించి-
సంప్రదాయంగా-పాయసం, పూలు, మొ॥ "బోనాలను"
నెత్తిన బెట్టుకొని ఉత్సాహంగా-
ఇరుగు పొరుగువారితో కలిసి వేలాదిగా మహిళామణులు-
భక్తి పాటలు, సంగీత, వాయిద్యాలతో
కోలాహలంగా సికిందరాబాదు మహంకాళిజాతర!
తొలితెలంగాణ ముఖ్యమంత్రి గౌ॥శ్రీ కల్వకుంట్ల చంద్రశేఖరరావు,
కేంద్రమంత్రి శ్రీ బండారుతత్తాత్రేయ,
ఇతర మంత్రులు-వివిధ రాజకీయ పక్షనాయకులు
అధికార-అనధికారులు-మహంకాళికి మొక్కుతారు!
కోరికలచిట్టాను సమర్పిస్తారు వేలాదిగా!
ఊరేగింపుగా-నగరం నలుమూలలనుండి వచ్చి-
భక్తి ప్రపత్తులతో-మనస్ఫూర్తిగా-మహంకాళికి నమస్కరించి-
అహంకారాన్ని తగ్గించుకుని-మార్దవాన్ని ఆర్జించుకుని-
మహంకాళిజాతరను నగరప్రజలు
జరుపుతారుఘనంగా! జనమెల్లరు వినంగా!
జాతరలతో జనాన్ని నగరం నిద్రపోనివ్వదు! నగరం నిద్రపోదు!!

❋ ❋ ❋

నీటి సముద్రం లేకపోయినా,
జన సముద్రంతో గంభీరత నెలకొన్న నగరం
విందులు, వినోదాలు, సమ్మెలు, పోరాటాలు-ఘర్షణల అలలతో-
నగరవాసులకు, పర్యాటకులకు-
నగరపు వినోదం జర్దాకిల్లీ కద్దినతగరం!
వినోదంతో పాటు సంప్రదాయానికి పెద్దపీట వేస్తుందినగరం-

**అదే-వినాయక పూజలు, నిమజ్జనోత్సవం.**
వినాయకుడు-గణపతి-లంబోదరుడు-గజాననుడు-
భారత సంస్కృతిలో అత్యంత ప్రముఖ దేవతా మూర్తి-పార్వతీపుత్రుడు-
ఉండ్రాలయ్య! ఏకదంతుడు!! ప్రథమారాధ్య దేవుడు!
బుద్ధి, సిద్ధిల ప్రియపతి-మూషిక వాహనుడు-
అఖండ భారతమంతా ఆచరించే పండుగ వినాయకచవితి!
నగరంలో బజారు బజారుకు, వార్డు వార్డుకు,
డివిజన్‌కూ-భారీ వినాయక విగ్రహ ప్రతిష్ఠ,పూజలు!
అందులో అత్యంత ఎత్తుతో భారీగా ఖైరతాబాదు వినాయకుడు!!
వేలసంఖ్యలో కళాకారులు రూపొందిస్తారు వినాయక విగ్రహాలను-
కళాకారులు శ్రమిస్తారు వినాయక విగ్రహాల తయారీకి మూడు నెలలపాటు-
నగరంలో అక్కడక్కడా-రోడ్డుప్రక్క-
ముఖ్యంగా శివానంద పునరావాస కేంద్రం, కూకట్‌పల్లి ముందు-
ఫుట్‌పాత్‌పై మొదలై- నేడు అనేకచోట్ల నగరంలో-
డేరాలతో కళాకారుల కుటుంబాలు-
వినాయక విగ్రహాల తయారీ ముఖ్యమైన జీవనోపాధి వారికి!
మిగతాకాలంలో-యితర విగ్రహాలు-ఇతర వ్యాపారం-
అన్ని వర్గాల కాలనీల్లో-చిన్నదేవాలయాల్లో-రైల్వేస్టేషన్లలో
వినాయక విగ్రహాల ప్రతిష్ఠ! పూజలు!!
ఆయా విగ్రహాల నిమజ్జనం- "లడ్డూలవేలాలు"- సాంస్కృతిక కార్యక్రమాలు-
ఓ పెద్ద కార్యక్రమంగా కన్నుల పండుగగా-
పోలీసు శాఖకు పనులు నిండుగా!
హైదరాబాదు, సికిందరాబాదుల వారధి హుస్సేన్‌సాగర్‌లో-
వివిధ ఆకారాల, సైజుల వినాయక విగ్రహాల నిమజ్జనం-
పని కల్పిస్తూ పెద్ద, చిన్న క్రేన్‌లకు మెండుగా?
నగరంలో అన్ని టి.వి.ఛానళ్లు ప్రసారం చేస్తాయి వినాయక నిమజ్జనాన్ని-
అనేక మూలల నుండి ఊరేగింపుగా వచ్చే
వినాయక విగ్రహాలను చూడవలసిందే కాని-
భారీ ఖైరతాబాదు వినాయక విగ్రహం ఊరేగింపు సాగుతుంది-
పన్నెండు గంటల పాటు! చెప్పనలవి కాదు

ఖైరతాబాదు భారీ వినాయక విగ్రహంపై (08-09-2014)
హెలికాప్టరులో ఆకాశం నుండి
పూలవర్షం కురిపించినాడు తెలంగాణ తొలి ముఖ్యమంత్రి
శ్రీ కల్వకుంట్ల చంద్రశేఖరరావు!
తరువాత సం॥(2015)న పర్యావరణానికి అనుకూలంగా
మట్టి విగ్రహాల ఉపయోగించారు నగర ప్రజలు!!
వినాయకుల నిమజ్జనం రోజున నగరం అసలే నిద్రపోదు! జనాన్ని
నిద్రపోనివ్వదు!!

❄ ❄ ❄

పల్లెలో, పట్నాల్లో ఉండే నివాసులకు నగరం ఒక వ్రేలాడే స్వర్గం!
వచ్చిచూస్తేగాని-అర్థంకాని-ప్రత్యక్ష-మేడిపండు చందం!!
నగరంలో-పల్లె, పట్నాలనుండి రోజూ అవుతాయి సరఫరా-పాలు,
పూలు-కూరగాయలు-
కొన్ని విషయాల్లో-నగరం వెనుకబడింది-
పండుగల విషయంలో- కాని-
తెలంగాణ రాష్ట్రం ఆవిర్భావం తరువాత-అధిక ప్రాధాన్యమివ్వబడి రాష్ట్రపండుగగా
అధికార పండుగగా పుట్టి-అందమైన అతివలు ఆనందంగా చేసుకునే పండుగ
**బతుకమ్మ పండుగ సంబరాలు!**
ఇప్పుడు-నగరంలో అన్ని లోగిళ్లలో ఆడపడుచులు అలంకరించుకుని-
రకరకాలపూలను-బంతి, చేమంతి, కాగితం పూలు,
తంగేడుపూలు, గుమ్మడిపూలు, దొండ,బెండ-
దిరిసెనపూలు, తామర, రకరకాలగడ్డిపూలు-మల్లె, బొండుమల్లె,
సంపంగి, గులాబీలు, పొన్నాగ-
మందారపూలు, ఎర్రగన్నేరు, తెల్లగన్నేరు, దవనం,
అలా దొరికిన పూలతో ఒకపెద్ద పళ్లెంలాంటి పాత్రలో
పేర్చుకుని-కుంకుమ, పసుపులలో గౌరిదేవిని చేసి-అందులో వుంచి-
సాయంత్రం దానిని-నెత్తికి ఎత్తుకుని-అందరూ గుంపులు, గుంపులుగా-
'బతుకమ్మ! బతుకమ్మ! "ఉయ్యాలో!"-అంటూ

పాట పాడుతూ–అనేక చెరువుల ఒడ్డుకు వచ్చి–
నగరంలో హుస్సేన్ సాగర్ ఒడ్డుకువచ్చి–
పదులు, వందలు, వేలాది ఆడపడుచులు
బతుకమ్మను కొంతసేపు నేలపై ఉంచి–వాటి చుట్టా తిరుగుతూ–
నాట్యంచేస్తూ–బతుకమ్మపాటపాడుతూ
అత్యంత ఉత్సాహంగా–భక్తి, శ్రద్ధలతో–
ఒకరినొకరు పలుకరించుకుంటూ–కుశలప్రశ్నలు వేసుకుని–
మంచి చెడ్డలు మాట్లాడి, తెలంగాణ సంస్కృతులను గుర్తుకుతెచ్చుకుంటూ–
దేశపరంగా, రాష్ట్రపరంగా, సంఘపరంగా–
సంతోషంగా, సంఘటితంగా ఉండాలని
వనితలంతా వరుసలు కలుపుకుంటూ–
తమతమ స్థితిగతులను తెలుపుకుంటూ–
కుటుంబాల్లో ఆడ, మగ వాళ్ల ఆగడాలను చెప్పుకుంటూ–
తమకున్న ఖరీదైన దుస్తుల్నిధరించి, ఉన్న నగల్ని అలంకరించుకుని–
తమ తమస్థాయిలను వేషధారణలో తెలుపుకుంటూ–
కొన్ని గంటలు–తమ, తమ ఇంటి బాధల్ని మర్చిపోయి–
బతుకమ్మలను తెచ్చిన మహిళాలోకం–
ఆనందంతో గడిపే సమయం!
చివరలో బతుకమ్మలను చెరువుల్లో నెమ్మదిగా వదిలివెనుదిరిగే సంబరం!!



తెలంగాణ గ్రామీణ జీవితంలో నల్లపోచమ్మ, పెద్దమ్మతల్లి–
గ్రామదేవతలు ప్రాధాన్యం వహిస్తారు
ఎక్కువగా అవి గ్రామాల్లో చిన్నదేవాలయాలుగా వుంటాయి–
ప్రజలచేత పూజలందుకుంటాయి.
నగరం నడిబొడ్డున జూబ్లీహిల్స్‌లో–విశాలమైన ప్రదేశంలో–
పెద్ద పెద్ద ముఖద్వారాలతో **పెద్దమ్మ తల్లి దేవాలయం**
సుమారు నూటయాభై సంవత్సరాల చరిత్ర కలిగిన దేవాలయం–

అయినా–పందొమ్మిది వందల తొంభై మూడు నుండి–
పెద్దమ్మ గుడికి తిరిగింది దశ–పట్టింది మహర్దశ!!
పేద, ధనిక భేదాలు లేకుండ–స్థానిక ప్రజా ప్రతినిధులు
పరదేశీ ప్రతినిధులు పర్యాటకులు
భూరిదాన, భక్తి ప్రపత్తులతో అనేక మంది భక్తులు మార్చారు దేవాలయం దశ!
మాజీ మంత్రి కీ.శే. పి.జనార్ధనరెడ్డి చొరవతో వృద్ధిచెందింది
ఈ పెద్దమ్మతల్లి దేవళం–
పెద్దపులి వాహనంపై దుర్గాదేవతగా–మహిషాసురమర్దినిగా–
శక్తికి మారురూపంగా–జగతికిజననిగా–
దుష్టులకు సింహస్వప్నంగా–భక్తులకు అభయహస్తంగా,
సుందరంగా–ఆలంబనగా–అక్కడ దుర్గామాత విగ్రహం!
పెద్దమ్మ తల్లి చిన్న చిత్క దేవాలయాలకు నాయకునిలా–
పెద్దమ్మ తల్లి దేవాలయం.
పల్లె ప్రజలు ఎక్కువగా జానపద కళారీతులతో, విచిత్రవేషధారులు–
వర్షాభావంలో నెర్రెలు వీడుతున్న భూమిపై కురవాలని వర్షాలు–
తొలగాలని కరువు–పెద్దమ్మ తల్లి జాతర–
దేహంలో రోగాలు తొలగి–దేశంలో విద్రోహులు సమసి–
శాంతి పూలు పూయాలని–కాంతి ఎంతో రావాలని–
చేస్తారు జనం జాతర–వేస్తారు కరువుకుపాతర!
పెద్దమ్మదేవాలయం
నగరంలో జనులకు నిరంతరం ప్రసారం చేసే శక్తి నిలయం!

❄ ❄ ❄

నేడు నగరం ఒక కాస్మో పోలిటన్ నగరం!
అనేక జాతులు కలిసి నివసిస్తున్న అద్భుతనగరం!!
పాతనగరంలో "చార్‌మినార్" పక్కన
ప్రపంచాన అతిపెద్ద ఏడవమసీదు –**మక్కామసీదు**–
పదివేల మంది భక్తులు ఒక్కసారే 'అల్లా'ను

ప్రార్థించే విధంగా–
క్రీ.శ.1617లో 'మహమ్మద్ కులీకుతుబ్‌షా'చే ప్రారంభించబడి–
క్రీ.శ.1694లో చక్రవర్తి ఔరంగజేబు ఆజ్ఞల ప్రకారం–పక్కాగా నిర్మించబడ్డ–
ఈ మక్కా మసీదు–పాతనగరంలో
ముస్లిం సోదరులకు ఒక గొప్ప ప్రార్థనామందిరం!
ప్రపంచ ప్రఖ్యాత పవిత్ర 'మక్కా' నుండి తెచ్చిన ఇటుకలు దీని నిర్మాణంలో వున్నాయి–
ఈ కారణంగా–ఈ మందిరానికి 'మక్కామసీదు' అనిపేరు
టపటప రెక్కలాడిస్తూ–గింజలకోసం కిందికిదిగి వాటిని తిని–
మళ్లీ–పైకి గుంపులుగా ఎగిరే వేలాది పావురాల విన్యాసాలు–
సాహసాలు–సావాసాలు–నయనానంద కరమక్కడ!
'అల్లాహో అక్బర్' ప్రార్థనల శబ్దంతో పావురాల రెక్కల సంగీతం అవుతుంది మిళితం.
ఒకసారి కొందరు దేశద్రోహుల, ఉగ్రవాద అగ్రముఠా జరిపిన దాడినిఎదుర్కొని
పోరాడి–గెలిచి–దేశభక్త ముస్లిం సోదరులకండగా నిలిచింది మక్కామసీదు!
మతసామరస్యతకు రసీదు!!
మహమ్మద్ ప్రవక్త, ఇతర ఇస్లాం గురువులు నివసించిన
గదుల సమూహంతో పవిత్ర మక్కా మశీదు.
ఐదు సింహద్వారాల కట్టడం మక్కా మశీదు–
అరవై ఏడు మీటర్ల పొడవు, యాభై నాలుగుమీటర్ల వెడల్పు–
ఇరవైమూడు మీటర్ల ఎత్తుకలిగిన విశాలమైన ప్రార్థనామందిరంలో
ఒకవైపు ఐదు ఆర్చీలతో, పదిహేను ఆర్చీల పైకప్పుతో
విలసిల్లే మక్కామసీదు–
పాతనగరం ఆకాశంనుండి కాంతులీనుతూ
వేలాదే ముస్లింల పవిత్ర మందిరం ఇది–
ఈ రాచమందిరానికి ఎడమవైపు
నైజాము రాజుల సమాధులున్నాయి–
లెఖ్ఖ ప్రకారం ప్రార్థనలతో పాతనగరం
నిద్రపోదు! భక్తులను నిద్రపోనివ్వదు!!



ఎన్నో చారిత్రక ఘటనలకు, వారసత్వభవనాలకు
ఆరోగ్యపు చెట్ల పొదులకు-ఇష్టం వచ్చిన చోట
నర్తించే వర్షపుమేఘాలకు-
ఇప్పటికీ పాతబస్తీలో పహరా గుర్రపుడెక్కల చప్పుడుకు-
స్పందిస్తూ-చలిస్తూ-అందంగా అందరికే నచ్చే నగరంలో-
పాత నగరంలో చారిత్రక **చార్‌మినార్** నిలబడింది!
చార్‌మినార్-నాలుగు స్థంబాల చతురస్రపుకట్టడం-
నిజాం నవాబుల పాలనా ప్రతీక!
నగర సందర్శకులకు ప్రత్యేక ఆకర్షణ చార్‌మినార్!
గ్రానైటు, సున్నంతో ఇండో-సరాసెనిక్ సంప్రదాయంతో ఇది!
భూమినుండి నలభై ఎనిమిది దశాంశాల ఏడు(48.7) మీటర్ల ఎత్తులో-
ఎన్నోమైళ్ల దృశ్యాలను కనువిందు చేస్తూ
అందంగా చెక్కబడ్డ నాలుగు స్థంభాలు!!
ముఖ్య కట్టడానికి నాలుగు మూలలా ఇరవైమీటర్ల ఎత్తులో-
చిన్నదై పోతున్న శిఖరంలో నాలుగుస్థంభాలు!!
ఒక్కో స్థంభానికి ఒక్కో కథవున్నది. చివర ఒక ఉంగరం చెక్కబడివున్నది.
తాజ్‌మహల్ లా కాకుండా-ముఖ్య కట్టడానికి-
నాలుగు మూలల్లో-చిన్న స్థంభాలు నిర్మింపబడ్డాయి-
అవి సంగీతాన్ని విన్పిస్తాయి!
చిన్న స్తంభాలలోపలవున్నవి-నూట నలభైతొమ్మిది మెట్లు-
ఎక్కితే ఆ మెట్లు మెల్లగా-చిట్టచివరి ఎత్తైన చోటుకు చేరవచ్చు.
అక్కడి నుండి చూడవచ్చు మన చారిత్రక సుందరమైన నగరాన్ని! నగరదృశ్యాల్ని!!
ప్లేగుమహమ్మారి అంతానికి గుర్తుగా
క్రీ.శే. కులీ 1591లో (కులీ-సేవకుడు) కుతుబ్‌షా
కట్టించిందే ఈ అందాల చార్‌మినార్
శుక్రవారం నమాజుకు పెద్దసంఖ్యలో వచ్చే ముస్లింసోదరులకు
నలభై అయిదు విశాలమైన ప్రదేశాలు
నాలుగు ముఖ ద్వారాలకు సొగసుతో అమర్చబడ్డాయి నాలుగు గడియారాలు
క్రీ.శ. 1889లో.

విశేషంగా–దక్షిణం, పడమరమూల–
లక్ష్మీ దేవికి అంకితమైన చిన్న దేవాలయం వున్నది–చార్‌మినార్‌లో–
మత సామరస్యానికి తార్కాణంగా నిలచిన ఆ ప్రదేశంలో.
ఎప్పుడూ నగరం మేల్కొనేవుంటుంది! జనమూ నిద్రపోరు!!



హలాలనన్నీ పోగేసి–పొలాలనన్నీ దున్నేసి–
కలాలనన్నీ కట్టగట్టి దౌర్జన్యాలపై నిరోధక, నిరసన శరాలుగా మార్చి
అభ్యుదయ శక్తులు ఏకమైన వేళ–
సుత్తి, కొడవలి, నక్షత్రం, కంకి కొడవళ్ళు–పట్టేకార్మికులు, కర్షకులు–
పెట్టుబడి దారీ వేటగాళ్ల ఆటలు కట్టించాలనుకున్నవేళ–
నిస్వార్థం, సమాజక్షేమం, జాతిమెచ్చేవిధానం, నిరాడంబరత, నీతి
ఉట్టిపడుతుండగా–
కర్షక జగతిన పుట్టిన కార్మికలోకపు ఆశాజ్యోతియై వెలిగి మలిగిన
'కమ్యూనిస్టుగాంధీ'గా పిలువబడ్డ కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య–
ఆశయాల సాధనలో, సోషలిస్టు సమాజ స్థాపనలో భాగం
సుందరయ్య విజ్ఞాన కేంద్రం! బర్కత్‌పురాలో నగరాన!
అన్నిశాఖల, వర్గాల, జాతుల, శాస్త్రాల గ్రంథాల, సంస్కృతుల చలివేంద్రం!
దక్షిణభారత కమ్యూనిస్టు (మార్క్సిస్టు) పార్టీ ఉద్యమ నిర్మాత–
కీ.శే.కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య విజ్ఞానకేంద్రం!!
ఉద్యమాల, ఆదర్శజీవిత విశేషాల సమాహార, సమాచార కేంద్రం–

**సుందరయ్య విజ్ఞానకేంద్రం!**

ప్రపంచ దేశాల, భారత కమ్యూనిస్టు పార్టీ
చరిత్రలజ్ఞానసముపార్జన మందిరం–
ప్రగతిశీల, ప్రభావితశీల సంఘాల సమావేశాలకు వెన్నుదన్ను–
పార్టీ పత్రికల, ఇతర పత్రికల ప్రచురణలకు–
పాఠకులకు, విజ్ఞానులకు, విద్యార్థులకు, పరిశోధకులకు–
అన్యాయ, అక్రమ వ్యతిరేక కార్యకలపాల శక్తులకు–

కార్మికవర్గ, స్త్రీ జనోద్ధరణ-
బడుగు, బలహీన వర్గాల, మైనార్టీ వర్గాల నాయకత్వాలకు-
బహురకాల సాహిత్య చర్చలకు, కార్యక్రమాలకు, కవి సమ్మేళనాలకు-
బహుపురాతన, ప్రసిద్ధ తెలుగు, ఇతర భాషాతాళపత్ర ప్రతులకు, శాసనాలకు-
అన్ని సౌకర్యాలతో, హంగులతో, సామాన్యుని కామనలకు దీవెనగా-
కథా, కవితా, రచనా కార్యశాలల నిర్వహణకు వీలుగా, కరదీపికగా-
సమాజవికాస, వామపక్ష భావజాల ప్రచార, ప్రసార, ప్రచురణ కార్యకలాపాలకు-
మతతత్త్వ వ్యతిరేక శక్తుల పునరేకీకరణకు-
భారతదేశ, తెలంగాణ రాష్ట్ర ప్రజల జీవనశైలి పరిరక్షణకు-
తెలంగాణ సాయుధ రైతాంగ పోరాట స్మృతులకు-
అమరవీరులు చాకలి ఐలమ్మ, దొడ్డి కొమరయ్యల ధైర్యసాహసాల నెమరుకు-
నగరం నిద్రపోదు-పోరాటశక్తులు నిద్రించవు!
వామపక్ష పార్టీల, నాయకుల, కార్యకర్తల, కర్తవ్య పునశ్చరణతరగతులకు-
సుందరయ్య విజ్ఞాన కేంద్రం పెద్దదిక్కు!!

❄ ❄ ❄

ప్రకృతి అందాలను చూడటం, తన్మయత్వం చెందటం.
అరుదైన వస్తువులను చూడటం లేక కొనటం లేక సేకరించటం-
మనిషిలోని ఆరాధనాశక్తికీ, సమాచారాన్ని నల్గురికీ పంచాలన్న ఆసక్తికీ ప్రతీక!
పలువస్తువుల, శిల్పాల లేక ఆకృతుల సేకరణ-వాటిని ఒకచోట భద్రపరచటం-
మనిషి భవిష్యద్దర్శనానికి-పురాతనవస్తు ప్రదర్శనశాలలు!
అందులో ఒకటి నగరంలో ప్రసిద్ధి కెక్కిన **సాలార్‌జంగ్ మ్యూజియం!**
ప్రపంచంలో ఏకవ్యక్తి సేకరించిన పురాతన వస్తువుల, పెయింటింగ్‌ల
భారతదేశంలో అతిపెద్ద మూడవ వస్తు ప్రదర్శనశాల-అతి పెద్దప్రదర్శనశాల-
నగరపు సౌందర్యనశాల సౌందర్యాలలో ఒకటి-సాలార్‌జంగ్ మ్యూజియం?
సాలార్‌జంగ్ కుటుంబ భవనం-దేవాన్‌దియో-దారుషఫావద్ద-
కళల పట్ల గొప్ప ఆసక్తిగల మీర్ యూసఫ్ అలీఖాన్ (సాలార్‌జంగ్-మూడు)
అతని ప్రధాని మీర్ ఉస్మాన్ అలీఖాన్, నిజాం ఏడు (1899నుండి1949వరకు)-
మూసీ నది దక్షిణం ఒడ్డున-స్థాపించినాడు-
1968లో చార్‌మినార్‌కు దగ్గర్లోనే 1951లో స్థాపించిన భవనాలకు

తరలింది సాలార్‌జంగ్ మ్యూజియం!
ఒకటవ శతాబ్దినుండి-ప్రపంచంలోని అనేక నాగరికతలను
ప్రతిబింబించే వస్తువులను సేకరించిన వాడు-
సాలార్‌జంగ్-మూడు-భారతదేశంలో ఖ్యాతి గడించినవాడు.
నలభై మూడువేల వివిధ వస్తువుల సేకరణలలో విరాజిల్లే
పురాతన వస్తుప్రదర్శనశాల ఇది!
భారతీయకళలు, మధ్యప్రాచ్యకళలు, ఐరోపా కళలు-నేపాల్‌దేశ కళలు-
టిబెట్ మరియు బర్మా కళలు, దూర ప్రాచ్యకళలు-
అలా ఆరు విభాగాలలో పాటు-పిల్లల విభాగంలో-సాలార్‌జింగ్ మ్యూజియం.
అసాధారణమైన పురాతన వస్తువులను ప్రైవేటుగా సేకరించి-
నిర్మించిన ఈ మ్యూజియంలో
ఇటలీ శిల్పకారుడు చెక్కిన-మెహిస్టోఫిలిస్ మార్గరెట్టా విగ్రహం చెప్పుకోదగ్గది.
ముఖ్యంగా-బడిపిల్లలకు, కాలేజి విద్యార్థులకు,
విజ్ఞాన జిజ్ఞాసువులకు- అపురూప-సాలార్‌జంగ్ మ్యూజియం!
వస్తు, విగ్రహ, చిత్ర, విచిత్ర వస్తువుల సేకరణకు-
విద్యార్థులు, సామాన్యులు సాలార్‌జంగ్ మ్యూజియం సందర్శనలో
పొందుతారు ప్రోత్సాహం!! వారిజ్ఞానతృష్ణ నిత్యం మెలకువతో వుంటుంది!!



పుస్తకం హస్తభూషణం! మంచి పుస్తకం నీడన మనసెంతో చల్లన!
గ్రంథాలయాలు-మానసిక వికాస కేంద్రాలు!!
తెలుగు సాహిత్య కార్యక్రమాల నిరంతర నిత్యవేదిక-
చిక్కడపల్లి **నగరకేంద్ర గ్రంథాలయం!**
గ్రంథాలయంతో పాటు సాహితీ, సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణకనువైన
ఏకైక సంస్థ నగర కేంద్ర గ్రంథాలయం-
చిక్కడపల్లి పరిసర ప్రాంత తెలుగువాడు-
మిరపకాయ బజ్జీలు తిని, టీ కాఫీ, తాగి-
సాయంత్రం అడుగుపెట్టేది నగర కేంద్ర గ్రంథాలయ సంస్థే!
చిన్నో-పెద్దో-సీనియర్, జూనియర్-కవితా సంకలనం-
కథాసంకలనం-వ్యాససంకలనం-

ఆవిష్కారాలకు-పురస్కారాలకు-చర్చా వేదికలకు, చిరునామా ఇది!
చిక్కడపల్లి, సుధాహోటలు పక్క సందులో, త్యాగ రాయగాన సభను దాటి-
ఉల్లి పకోడీలు, మిరపకాయ బజ్జీలు, చిట్టివడల వాసనలను పీల్చుకుంటూ-
కొంచెం ముందుకెళ్తే-తెలుగు వారి ముఖ్యంగా-
తెలంగాణరాష్ట్ర సాహితీ క్షేత్రం-నగరకేంద్ర గ్రంథాలయ సంస్థ!
యువభారతి సాహిత్య సమావేశాలు, వ్యక్తిత్వ వికాసతరగతులు-
జరుగుతున్నది యిక్కడే,
నవ్య సాహితీ సమితి, మానస ఆర్టు థియేటరు,
విశ్వసాహితి మొ॥ అనేక సాహితీ సంస్థలకు వేదిక!
దాదాపు అన్ని రకాల దినపత్రికలు, తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూలో-
కొన్ని రకాల మాసపత్రికలు, పక్ష పత్రికలు, త్రైమాసిక పత్రికలు-
చదువుకోవటానికి పాఠకులకు తగిన సౌకర్యాల వేదికఇది.
తెలుగుతో పాటు-అనేక భాషల కొన్ని గ్రంథాలతో పాటు-
రిఫరెన్సు కేంద్రంగా -వుంటూ-
ఒక సంచార గ్రంథాలయాన్ని నగరంలో నిర్వహిస్తున్నది
నగర కేంద్ర గ్రంథాలయం!
ముఖ్య సమావేశ మందిరంలో
జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత కీ.శే. కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి
విగ్రహంతో విరాజిల్లుతూ-నడుస్తున్న
సాహిత్య వికాసానికి ముఖ్య ఆధరువు నగర కేంద్రగ్రంథాలయం.
సమావేశాలకు-మధ్యతరగతి వారి సాహిత్య సాంస్కృతిక కళామందిరమే
నగర కేంద్ర గ్రంథాలయసంస్థ!



కడుపు ఆకలి తీరాక-కాలక్షేపానికి పుట్టాయి కళలు-ముందు.
నృత్యం, గానం రెండూ మానవజాతికి అందివచ్చాక-
వినోదానికా? వికాస, ప్రయోజనానికా? ప్రశ్నలొచ్చాయి.
"వినోదపూరిత, వికాస భరిత ప్రయోజనానికే"-

అన్న యోచకకే వచ్చాయి ఎక్కువ ఓట్లు!
భరతుడు-నాట్యశాస్త్రం-నాటకాలు-నాటికలు-
వివిధ నృత్యాలు-జానపద కళాలు
నాలుగు గుంజలతో ప్రారంభమైన వేదికలు-
నేడు-అత్యంత సాంకేతిక పరిజ్ఞానంతో-
శబ్దం, వెలుగుల-కలయికలతో-
ఆధునిక కళావేదికలు వెలిసాయి రాష్ట్రంలో ఎన్నోచోట్ల!-
అమిరాయి కళాకారులకు సౌకర్యంగా-
కళాప్రదర్శనలకు సౌకర్యంగా-సరసంగా అనునిత్యం.
అందులో ముఖ్యమైనది-ఒకటి-నగరం నడి బొడ్డున-**రవీంద్ర భారతి!**
సాహిత్యంలో నోబెల్ బహుమతి గ్రహీత రవీంద్రనాథ ఠాగూర్ పేరిట-
నగరంలో నెలకొల్పబడ్డ సాహితీ హారతి రవీంద్రభారతి!
నగరంలో తెలంగాణ రాష్ట్రానికి మిగిలిన
ఏకైక సాహితీ, సాంకృతిక వీచికలకు నెలవు-
సాహిత్యేతర కార్యక్రమాలకు కూడా ఒక కొలువు-రవీంద్ర భారతి!!
ప్రభుత్వ కార్యక్రమాలకు, ప్రజాకార్యక్రమాలకు-
జంటనగరాల నడుమ నిల్చిన కళామోహిని-యోగిని-రవీంద్రభారతి!
ఒకప్పుడు అతి తక్కువ ఖర్చుతో జరిగేవి కార్యక్రమాల నిర్వహణ-
పక్కనే-ఇడ్లీ, చట్నీ సాంబార్, కారప్పొడితో, పెరసట్టు, మసాలాదోసే, గారె-
తెలుగువాడి రుచుల పెన్నిధిగా ఒకహోటలు వుండేది సరసమైన ధరలతో-
అది కనుమరుగైంది-నేడు-
రవీంద్రభారతిలో కార్యక్రమ నిర్వహణ బహుఖర్చుతో కూడుకున్నదే-
సామాన్య రచయితలకు, నటులకు, చిన్న సంస్థలకు అందని ద్రాక్షపండు-
రవీంద్రభారతి!
మనిషి ఎవరైనా
సాహిత్య, సంగీత, నాటక ప్రదర్శనలకు కరగని వారుండరు-
తెలంగాణ సంస్కృతిని, సాహిత్య చరిత్రను క్రమబద్ధీకరించుటకు-
కావాలి తప్పక రవీంద్రభారతి వేదిక **ఉచితవేదికగా-**
ఉండాలి తప్పక తెలంగాణ రాష్ట్ర తొలి ప్రభుత్వానికి

ఘనంగా చిత్తశుద్ధి!
ప్రజా సాహిత్యాన్ని-ప్రజలపక్షాన దాని భారం మెయ్యాలి ఈ తొలిప్రభుత్వం-
మరుగున పడ్డ కవులను, గాయకులను, నటులను వెలికితీయాలి.
మేలైన గ్రంథాలు, సందేశాత్మక నాటకాలు,
ప్రసంగాలు వెలగాలి రవీంద్రభారతిలో-
అప్పుడే అవుతుంది తెలంగాణ జాతికి రవీంద్రభారతి-
నిత్య సంస్కృతీ హారతి!
అర్ధరాత్రి దాకా సాగే కార్యక్రమాలతో
సాంస్కృతిక వేదిక వెల్గుతూనే వుంటుంది నగరంలో-



'త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు'
శంకరంబాడి గేయంలో ఒక పంక్తి-
సంగీత ప్రపంచాన, ఈ తెలుగులోకాన శాశ్వతంగా నిలిచే
వాగ్గేయకారుడు త్యాగరాజు పేరిట-
తాను నిద్రపోకుండా-నగరం ప్రజల్నిమేలుకొల్పుతూ
ప్రపంచ రికార్డుల స్థాయికి చేరిన ఒక కళామందిరం
చిక్కడపల్లిలోని త్యాగరాయ గానసభ!
అరవై ఏండ్లకుపైగా సాగిన తెలుగువారి ఉమ్మడి రాష్ట్రంలో-భాగ్యనగరంలో-
ఇతర సంగీత కచేరీలకు, పద్యనాటకాలకు, నాట్య ప్రదర్శనలకు
సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాలకు-
పుంఖాను పుంఖంగా వెలువడ్డ
కవితా, కథా, వ్యాస సంకలనాల ఆవిష్కరణలకు-ప్రత్యేక వేదికగా-
'తెనాలి ఆఫ్ హైదరాబాదు'గా పేరుబడ్డ- "మిరపకాయ బజ్జీలపల్లె"-చిక్కడపల్లిలో-
అందుబాటు ఛార్జీలతో-ఎందరినో ఆకర్షిస్తున్న కళామందిరం-**త్యాగరాయగానసభ!**
ఔత్సాహికుల ఆరంగ్రేటం నాట్యప్రదర్శనకు-గాన సభలకు-వార్షికోత్సవాలకు
అనువైన, అందమైన, అందరికీ అందుబాటులో-
త్యాగరాయ గానసభ! సంగీత సుధ!!



ప్రతి రెండవ తెలుగువాడు ఒక కవి అన్నాడు శ్రీశ్రీ
దాన్ని నిజం చేస్తూ–మరొక అడుగు ముందుకు వేసి–
ప్రతి తెలుగువాడు అయ్యాడు నేడు ఒక కవి!
ఆ కవిత్వాలను వినేందుకు లేదు శ్రోత–
ఆ అక్షరాలను కనేందుకు లేదు చదువరి–ప్రచురణ కర్త!
అలాంటి చిరుకవులకు, చిరు కథకులకు–
వ్యాసరచయితలు–నవలారచయితలకు–
నగరంలో ఆధునిక సాహిత్య మహాదేవుడు–శ్రీ కళావేంకట దీక్షితులు
ప్రపంచ గిన్నీసు బుక్కు రికార్డుగ్రహీత–
ఎలాగో అచ్చేసుకుని, ఆవిష్కరణకు తిప్పలు పడుతున్న
కవులకు–తాను నిర్మించిన ఎ.సి.కళాసుబ్బారావు మందిరాన్ని–
ఉచితంగా యిస్తున్నవాడు–ధన్యుడు–శ్రీ కళా వేంకట దీక్షితులు!
త్యాగరాయ గాన సభ ప్రాంగణంలో నేవున్న–
**కళా వేంకట సుబ్బారావు మందిరం** ఆవిష్కరణలకు అంకితం
సంస్కృతీ, సాహిత్య కార్యక్రమాలకు పునరంకితం!!

❄ ❄ ❄

నాటి–'ఆరోగ్యమే మహాభాగ్యం!'–సూక్తి–
నేటికి–మరునాటికి అందరూ మరువరాని మాట!
అందుకవసరమైన వాతావరణం–ఆహార, విహారాలు,
ఆర్థిక సర్దుబాట్లు–కావాలి సమన్వయం–
దేశప్రజలకు–ఉచితవైద్యం, విద్య అందించే బాధ్యత ప్రభుత్వాలదే!
ఆరోగ్యాన్ని రక్షించుకొనుటలో ముఖ్యం–వ్యక్తిగత శ్రద్ధ–
ఒకప్పుడు మూలికా వైద్యం, గృహవైద్యం ఉండేవి అందుబాటులో–
సంబంధాలు విస్తరించి, జ్ఞానసంపదను పరస్పరం
ఇచ్చిపుచ్చుకోవటంలో పుట్టింది–'అల్లోపతి'
నగరంలో గవర్నమెంటు ఆస్పత్రులకంటే–ధీటుగా–
శక్తివంతంగా–కార్పొరేటు ఆస్పత్రులు వచ్చాయి–
ఆరోగ్యకల్ప తరువుల్లా!
ప్రసిద్ధికెక్కిన 'ఉస్మానియా జనరల్ ఆస్పత్రి, గాంధీజనరల్ ఆస్పత్రి, నిమ్స్,

గవర్నమెంటు ముక్కు, గొంతు, చెవి ఆస్పత్రి, కాన్సరు ఆస్పతి,
ఛాతీజబ్బుల మరియు మానసికరోగుల ఆస్పత్రులు-
నగరపు ఆరోగ్య పరిరక్షక దళంలో-కొన్ని!
మామూలు వైద్యంతో పాటు -'అవయవముల మార్పిడి'-జరుగుతున్నవి!
బీదలకు అనగా తెల్లకార్డు ఉన్నవారికి-ఆరోగ్య శ్రీ ద్వారా-
తొలి తెలంగాణ ప్రభుత్వం-ఉద్యోగులకు-EHS ద్వారా-
ఉచితంగా వైద్యం చేయిస్తున్నది!
రోగాలపై పోరాటంలో-నగరం నేడొక-**ఆరోగ్య పర్యాటక కేంద్రం!**
ఎన్నో దేశాల రోగులు వస్తారిచటకు!
ఇప్పుడు నగరం-సమస్త అత్యాధునిక ఆయుధాలతో-
రోగాలతో పోరాడే అంతర్జాతీయ ఆరోగ్యశిబిరం!
నిద్రపోని నిరంతర ఆరోగ్యపరిరక్షక శరం!!



కోటలు-ఒకనాటి రాజుల రాజ్యాలకు కట్టిన రక్షణ శక్తులు-
కోటలు-రాజ్యంలోని ప్రజలు నిర్భయంగా ఉండే పేటలు!
శిథిలమైనాయి ఎన్నో! పిచ్చి మొక్కలు మొలచి వాటితో మసలుతున్నాయి-
మట్టిదిబ్బలై రూపుమాసాయి ఎన్నో!
మాణిక్యాలు మెరుస్తున్నాయి కొన్ని-భావితరాలకు బాటలుగా!
నిల్చి నిలబడింది ఇప్పటికి కొన్ని మాత్రమే! అందులో ఒకటి **గోల్కొండకోట-**
తొలితెలంగాణ ముఖ్యమంత్రి శ్రీ కల్వకుంట్ల చంద్రశేఖరరావు గారిచే
స్వాతంత్ర్యదినోత్సవ వేడుకలకు నిల్చినతోట!
పరిసర గ్రామీణ ప్రాంతాన ఒక వేయి అడుగుల ఎత్తైన కొండపై విస్తరించి-
నగరానికి దక్షిణాన శత్రువులు ఛేదింపలేనిదిగా పేరుగాంచిన కోట!
గొల్లల కొండ అర్థంలో-'గొల్లకొండ' అన్న తెలుగు పదం నుండి
పుట్టిన కోట-గోల్కొండకోట!!
మొదటి క్రీ.శ 1143లో ఓరుగల్లు కాకతీయరాజులు మట్టితో నిర్మించిన కోట-
అది తరువాత1364లో గుల్బర్గా యొక్కబహుమనీ రాజులకు దారాదత్తమైంది-
ఆ తరువాత క్రీ.శ. 1518నుండి1687 వరకు పాలించిన కుతుబ్‌షాహీ రాజులు-
అరవైరెండు సంవత్సరాలపాటు శ్రద్ధతో తిరిగి నిర్మించిన కోట ఇది!

తెలంగాణ రాష్ట్రంలో నేడు పెద్దకోట!
పదిహేడవ శతాబ్దంకల్లా-రత్నాలు, వజ్రాల వ్యాపారం ఖ్యాతికెక్కిన నగరం
ఔరంగజేబు చక్రవర్తి నాకర్షించింది!
మొఘల్ చక్రవర్తి ఔరంగజేబు ఎనిమిది నెలలు యుద్ధంచేసి-
గోల్కొండ కోటను స్వాధీనం చేసుకున్నాడు
నిర్మాణంలో అనేక ప్రత్యేకతలు కల్గిన గోల్కొండ కోట-
నేడు కుతుబ్‌షాహీ రాజవంశం సాధించిన గొప్ప విషయాలను, విజయాలను-
కీర్తిస్తూ నగరంలో సగర్వంగా నిల్చుంది!
తెలంగాణకు ప్రత్యేకతను సంతరించింది-
నేడు యిక్కడి ధ్వని, కాంతి (Sound and music) ప్రదర్శనలు
ప్రతి సాయంత్రం నిర్వహింప బడుతున్నాయి.

గోల్కొండ కోట పునరుద్ధరణ, పరిరక్షణ తెలంగాణ తల్లికి ప్రణామాలర్పించటమే!



నగరమంటే రాజమార్గాలకు నిలయం-
విశాలమైన రాజమార్గాలు నగరానికి అవసరం-
పాత నగరంయెట్లున్నా-కొత్త నగర నిర్మాణ అయింది ఒక క్రమపద్ధతిన-
జనాభాను బట్టి.
రానురాను నగర జనాభా పెరిగి-వచ్చిపోయేవారి సంఖ్యపెరిగి-
నగరం రోడ్లపై ప్రయాణం ఐంది ఒక నరకం! ఒక యాతన!
దాంతో అవసరమయ్యాయి నగరంలో
ఆకాశమార్గాలు Flyovers
అక్కడక్కడా ముఖ్యమైన రద్దీ ప్రాంతాల్లో నిర్మించబడ్డాయి ఆకాశమార్గాలు!
అందులో మన తెలుగు వాడు, తెలంగాణ ముద్దుబిడ్డ
మాజీ భారతదేశ ప్రధాని కీ.శే.పి.వి.నరసింహారావు మార్గం ఒకటి!
ఒకవైపు ప్రయాణపు దూరాన్ని-మరొకవైపు ప్రయాణపు కాలాన్ని-
ఇంకోవైపు ఛార్జీలను తగ్గిస్తూ-
బహుళ ప్రయోజనకరంగా నగరపు ఆకాశమార్గాలు!
ఉద్యోగ, వ్యాపార, సామాన్య, అసామాన్య వర్గాలకు వరంగా-

రోగులకు, విద్యార్థులకు-స్త్రీలకు మేలుగా-
మెలికలు తిరుగుతూ కొన్ని-ప్రమాదాలను నివారిస్తూ-
నగరదృశ్యాలను చూపే స్నేహితులుగా-
మధ్యలో పచ్చని, రంగురంగుల పూలచెట్లు-
వాటివాసనలను పీలుస్తూ, అందాలను తిలకింపజేస్తూ-
కాలినడకన వెళ్లేదారిలో పడుచులను, పోరగాళ్లను చూపిస్తూ-
రాత్రిపూట అత్యధిక కాంతులిచ్చే విద్యుత్ దీపాలతో వెలుగుతూ-
కొత్త కొత్త అనుభూతుల్ని, అనుభవాలను పంచుతూ-
ప్రయాణంలో పదనిసలనందిస్తూ-**'నగరపు ఆకాశమార్గాలు'**.



లోకానికి సూర్యునిలా-తెలంగాణకు హైదరాబాదు నగరం!
దూరాన వున్న గ్రామాల జనాన్కి నగరం ఒక గొప్ప అనుభూతి-
శాస్త్రీయ రంగాన-సాంస్కృతిక రంగాన బహుదూరపు బాటసారి నగరం!
వస్తారు నగర పర్యాటనకు-విద్యార్థులు, ఉపాధ్యాయులు- సామాన్యపౌరులు.
చూడాల్సిన వాటిల్లో-
నగరం నక్షత్రశాల-**బిర్లా మందిరం**-అంతరిక్ష వీక్షణా శిబిరం!-
నిద్రపోని నగరం మెడలో మరో మణిహారం-బిర్లామందిరం!
రెండు వందల ఎనభైఅడుగులు(ఎనభైఅయిదు మీటర్లు) ఎత్తున-
పదమూడు ఎకరాల విస్తీర్ణం(5300మీ)సో కాలాపహాడ్ అన్న కొండపై ఈ
మందిరనిర్మాణం!
హుస్సేన్ సాగర్ సరస్సుకు దక్షిణం చివరనవున్న బిర్లా మందిరంలో-
**లేనివి- గుడిగంటలు!**
ధ్యానానికి అంతరాయం కలిగించకుండా గంటలు లేని గుడి బిర్లామందిరం!
పదిసంవత్సరాలపాటు సాగిన ఈ నిర్మాణాన్ని
1976లో రామకృష్ణమఠం శ్రీ రంగనాథానంద ప్రారంభించారు.
రామాయణం, మహాభారతం ఘట్టాలను మలిచినదీ బిర్లామందిరం!
బిర్లా ఫౌండేషన్‌వారు ఇండియాలో అనేక చోట్ల నిర్మించిన మందిరాల్లో ఇదిఒకటి!

అసెంబ్లీ భవనాలకు, ప్రసార భారతి భవనాలకు దగ్గర్లో-
దక్షిణభారత, రాజస్థాన్ మరియు ఉత్కల దేవాలయ శిల్పకళల మిళితం
ఈ మందిరం-
పాలరాతితో చెక్కబడిన అనేక హిందూ దేవుళ్లు, దేవతల
విగ్రహాలతో-బిర్లామందిరం!

ఈనాడు-ఈనాడుపత్రిక, ఈ-టివిలతో పాటు-
సినిమా, పచ్చళ్లు, చిట్‌ఫండ్స్ మొ॥అనేక వ్యాపారాలను నిర్వహిస్తూ-
భారతదేశమంతటకు-విశ్వావ్యాప్తంగానూ
ఖ్యాతిగడించినవాడు-సి. హెచ్.రామోజీరావు!
మనిషి నిత్యజీవితంలో ఎదోఒక అవసరంలో
రామోజీరావును స్మరించాల్సిందే!
రెండువేల ఎకరాల్లో విస్తరించి అని హంగులతో-ప్రపంచంలో అతి పెద్దదిగా-
నగరం నుండి విజయవాడ జాతీయ రహదారి తొమ్మిదిలో వున్నది
రామోజీఫిల్మ్‌సిటీ!
ఎమ్యూజ్‌మెంటు పార్కులతో సహా-సినిమా షూటింగ్‌లకు,
**విహార యాత్రాస్థలంగా రామోజీ ఫిల్మ్‌సిటీ!**
సహజ సిద్ధమైన ప్రాంతాలు-కృత్రిమ సెట్టింగ్‌లతో
విశాలమైనదానిగా రామోజీరావు నిర్మించిన రామోజీ ఫిల్మ్‌సిటీ-
నగరంలో వున్న రంగురంగులవలలో-
ఒక-వల-రామోజీ సినిమానగరం!
అక్రమ సంపాదకులకు ఒక రాచనగరం-
ఒక స్వర్గధామం-రామోజీఫిల్మ్‌నగరం!



చుక్...చుక్ రైలు...లబ్‌లబ్ గుండె...టకటక గుర్రం....
రైలుబండి-దానిలో ప్రయాణం అందరి జీవితాల్లో పదనిస ప్రయాణమే!
రైలులో ఎన్ని సీట్లున్నాయో కాకుండా-
ఎన్ని టిక్కెట్లు కావాలంటే అన్ని టిక్కెట్లు అమ్ముతూపోతారు-
వీరికితోడు టిక్కెట్టులేని ప్రయాణీకులు రైళ్లలోనే ఎక్కువ!

దీంతో రద్దీ రైళ్ళలో టిక్కెట్లు కొన్న ప్రయాణీకులకు అన్నీ ఇక్కట్లే!
పొసగనివివాహ జీవితాలను రైలు పట్టాలతో పోలుస్తారు కొందరు!-
కాని పిల్లలనే రైళ్లు ఆ పట్టాలపైనే పరుగెత్తుతాయి
విజయ గమ్యం చేరుతాయి-ప్రయాణీకుల రద్దీని తగ్గిస్తూ-
నివాసప్రజలు, ప్రవాస ప్రజలు, పర్యాటకులు
సుఖవంతంగా ప్రయాణించుటకు-
తక్కువ సమయంలో నిరీక్షణలు లేకుండా గమ్యంచేరుటకు-
పర్యావరణాన్ని రక్షిస్తూ-పరిసర ప్రాంతాలను
పరిశుభ్రంగా ఉంచేందుకు-
నగరంలోని రోడ్లు రైలు మార్గాలకు తోడు-
చారిత్రక కట్టడాలు, మార్గాలను రూపు మాపకుండా-
గౌ॥ముఖ్య మంత్రి శ్రీ కల్వకుంట్ల చంద్రశేఖరరావు గారి సూచనలతో-
సికిందరాబాదునుండి లింగంపల్లి వరకు-
దిల్‌సుఖ్‌నగర్-ఉప్పల్ మొ॥ప్రాంతాలను కలుపుతూ
నగరపౌరుల కోసం-నిర్మితమౌతున్నాయి-**మెట్రోరైలు మార్గాలు!**
త్వరలో ప్రారంభమౌతాయి మెట్రోరైలు ప్రయాణాలు!!



మనిషి-ఒక సామాజిక జంతువే-
మనిషి పరిణామక్రమంలో (కోతి) వానరుని నుండి ప్రభవం!
మనకెన్నో జంతువులు అయ్యాయి "పెంపుడుజాతి"గా
పెంపుడు జంతువుల పెంపకం మనిషిజీవితానికెంతో ఆనందం!
ఆసరా! అవసరం కూడా!!
మనిషి పెంచుకోలేని జంతువులూ వున్నాయి-
మనిషిలో జంతువుల జీవితాలు పెనవేసుకునే వున్నాయి-
నగరంలో ఉంది అనేక జంతువుల ప్రదర్శనశాల-
అదే **నెహ్రూ జూలాజికల్ పార్కు!**
భారతదేశంలోని అతిపెద్ద ప్రదర్శనశాలల్లో ఒకటి-
పదిహేను వందల జాతుల జంతువులు సహజవాతావరణంలో-
జీవిస్తున్న జంతుప్రదర్శనశాలయిది!

పిల్లలకు, పెద్దలకు, యువతీ, యువకులకు-
ఆకర్షణీయమైన జంతుప్రదర్శనశాల!
రక్షణ కల్గిన వాహనాల్లో వెళ్లి
జంతువులను వాటి సహజనివాసఛాయల్లో చూడవచ్చు-
అనేక పాఠశాలలు, కళాశాలలు, విద్యార్థులు, అధ్యాపకులు, ఇతరులు-
వచ్చి వినోదమూ, విజ్ఞానము పొందేది నెహ్రూజంతు ప్రదర్శనశాల!
మూడు వందల రకాల పక్షుల్ని చూడవచ్చు-
కోతులకు, అరటిపండ్లు యివ్వటం, ఏనుగులకు ఆహారం యివ్వటం
ఏనుగుఅంబారీ ఎక్కటం-
ఒంటె సవారీ చేయటం-యిక్కడ సరదా, సరదా పనులు-
చిన్నరైలులో ప్రదర్శన శాలను చుట్టిరావటం మరో ఆనందం?
ప్రకృతి చరిత్రమ్యూజియం-పురాతన జీవిత మ్యూజియం-
అద్దాల పెట్టెల్లో చేపలను చూడటం-ఖడ్గమృగాన్ని వీక్షించటం-
అలా ఎన్నో వున్న జంతుప్రదర్శనశాల!
శాస్త్రజ్ఞాన విద్యార్థులు-జీవశాస్త్రజ్ఞులు తప్పక దర్శించవలసిన ప్రదేశం!!



సాయంకాలం తీరిక సమయం ఉన్నవాళ్లు-సందర్శకులు-
ముఖ్యంగా ప్రేమికులు-కాముకులు-పూలపైవాలే సీతాకోకచిలుకల్లా
చేరుతారక్కడకు-
సినిమా షూటింగ్సుకు-పాటల రికార్డింగులకు అనువైనచోటు-
రకరకాల రూపాల్లో చెట్ల పొదలు-పొదల మాటున దాగే ప్రేమ జంటలు-
రకరకాల నీటిఫౌంటెన్లు-డిజైన్లు-చెట్లు-మొక్కలు-వంతెనలు-మధ్యలో రోడ్లు-
కొందరు బిక్షగాళ్లకు-నిరుద్యోగులకు-యితర అభాగ్యులకు ఆశ్రయమిచ్చేతోట!!
మరి-తోటంటే తోటకాదు నిక్కచ్చిగా ప్రజలతోట-Public Garden ప్రజాతోట
నాంపల్లి ప్రాంతంలోని పార్కు-ఆసియా ఖండంలోనే
అతిపెద్దదైన పార్కు నగరం!-బాగ్-ఇ-ఆమ్-ప్రజాతోట!
ఈ తోటలో ప్రతిసంవత్సరం పూలప్రర్శన వుంటుంది-
పుష్ప ప్రియులతో నిండిపోతుంది ఆనాడు!

అనేక అద్భుత భవనాలు కల్గినది–ఈతోట–
ప్రధాన ద్వారమునకు కుడి ప్రక్క అద్భుతమైన చక్కని మశీదు–
చివరి నైజాం నవాబు అల్లా ప్రార్థనలు చేసిన మశీదు–
మన తెలంగాణ రాష్ట్ర అసెంబ్లీ భవన సముదాయం–
భారతరత్న కీ.శే.అబ్దుల్ కలాం ప్రాచ్యఅధ్యయనాల సంస్థ–
పిల్లలకోసం చాచానెహ్రూ బాలభవనము–జూబ్లీహాలు–అజంతా వేదిక–
ఇందిరా ప్రియదర్శిని ఆడిటోరియం–
రాష్ట్ర పురాతత్త్వశాఖ ప్రదర్శనశాల, ఆరోగ్య సంబంధిత ప్రదర్శనశాల,
టెన్నిసుకోర్టు మొ॥నవి ఈ తోటలో–
జీవితంలో ఎన్నో బాధ్యతలు, అనుభవాల సాధనకు
ఈ తోట సందర్శన అవసరం,
అసెంబ్లీకి ఎదురుగా–రాజమార్గాన–ప్రసార భారతి భవనాలు
ఈ తోటకున్న మరిన్ని వన్నెలు!

హుస్సేన్ సాగరుకు ఆవలవైపు–
3.6కి.మి–కంఠహారం రోడ్డు–(నెక్లెసురోడ్డు)
కంఠహారం రోడ్డుకు దగ్గర్లోనే దక్షిణ భారతానవున్న వాటిలో ఒకటిగా–
**ఐమాక్సుసినిమాహాళ్లసముదాయం!**
అతిపెద్దతెరతో, అద్భుతమైన ధ్వనివ్యవస్థతో–ఐమాక్సు సినిమాహాలు.
భారతదేశంలోనే మొదటిసారి–మొదటి అనేక సినిమాహాళ్ల ప్రాంగణం
ఐమాక్సు సినిమాహాళ్లసముదాయం!
ఇక్కడే–వివిధవస్తువులతో దుకాణాలు మరియు ఆహారపుశాలలు వున్నాయి
నగరంలో వున్నవారు, నగరానికి వచ్చిపోయే వారు–ఖరీదు ఎక్కువైనా–
ఒక్కసారైనా ఐమాక్సు సినిమాహాల్లో ఏదైనాచిత్రం చూడాల్సిందే!
ఆనందించాల్సిందే!!



నగరంలో అతి ప్రసిద్ధి చెందిన సందర్శనీయ స్థలం–లుంబినీవనం!
హుస్సేన్ సాగర్ ఒడ్డున వున్నదీ వనం
లోనికి వచ్చే ద్వారం వద్ద పువ్వులగడియారం–

అద్భుతమైన సంగీత, నృత్యజలపాతాలు ప్రత్యేక ఆకర్షణలు–
ప్రతిరోజు సాయంత్రం ఆరున్నర గంటల నుండి ఎనిమిదిన్నర గంటలవరకు
జరిగే సంగీత జలపాతం ప్రదర్శన చాల ప్రసిద్ధిచెందినది!
లాహిరి లాహిరోలో....పడవ ప్రయాణం! 'మాయాబజారు' చిత్రం కళ్లముందు–
ప్రేమికుల ప్రేమ ప్రయాణం–సందర్శకుల విహార, విశ్రాంతి ప్రవాహాలు–
సాయంత్రం సంధ్య వేళనుండి రాత్రి దాదాపు పదిగంటల వరకు
ప్రజలనాకర్షించే జంట నగరాల
బుద్ధుడి ఆశీర్వాదాలకు–బుద్ధిజీవుల మానసోల్లాసానికి–
వాసికెక్కినవారి, సమాజసేవకంకితమైన వారి విగ్రహాల వీక్షణకు వేదిక–వంతెన–
నగరంలో వినోద, విలాస కాలక్షేప కేంద్రం–
అందమైన **హుస్సేన్ సాగర్** అనబడే టాంక్‌బండ్ వంతెన!
క్రీ.శ. 1562లో ఇబ్రహీం కుతుబ్‌షా పరిపాలనలో–
మూసీ ఉపనదియైన బల్కాపూర్
హజరత్ హుస్సేన్‌షావలీచే నిర్మించబడ్డ ఈ ప్రజోపకరమైన వంతెన–
అతని పేరుతోనే పిలువబడుతున్నది.
వాస్తవానికి సికిందరాబాదు నగరానికి నీరు సరఫరాకోసం–
నిర్మింపబడ్డ హుస్సేన్‌సాగర్ ప్రసిద్ధి చెందింది ఒక విహారయాత్రాస్థలంగా!
బోటులోషికారు, ఇతర నీటి ఆటలెన్నో ఇక్కడఆడవచ్చు–
ముఖ్యంగా–హుస్సేన్‌సాగర్ నడిబొడ్డున అభయహస్తంతో,
350టన్నుల ఏకశిలనుండి ఐదుసంవత్సరాల శ్రమతో మలచబడ్డ
పదిహేడున్నర మీటర్ల బుద్దవిగ్రహం!
రాక్‌గిబ్రాల్టర్‌గా పిలువబడే రాతికట్టడంమీద–
నేడు–ఆ బుద్ధ విగ్రహం ఐనది హైదరాబాదు నగరానికి
ఒక అందమైన, ఆధ్యాత్మిక ప్రతీక!
దగ్గర్లోని సెక్రటేరియట్ రోడ్డుకు ఉత్తరాన ఉన్న లుంబినీ పార్కునుండి–
బుద్ధుడివిగ్రహం చుట్టూతిరుగుటకు–బోటుషికారు సదుపాయం కలదు.
హుస్సేన్‌సాగర్ తూర్పు ఒడ్డున ప్రాచుర్యం చెందిన
నడకమార్గమే–టాంక్‌బండ్!
హైదరాబాదు–సికిందరాబాదు జంటనగరాల మధ్య

సంధానంగా పనిచేస్తుంది-టాంక్‌బండ్!
టాంక్‌బండ్ రోడ్డుకు తూర్పువైపున-నల్లపాలరాతి
గొప్పచారిత్రక, సాహిత్య, రాజకీయ సేవారంగాల ప్రముఖుల విగ్రహాలు!
టాంక్‌బండ్ రెండు చివరలా-విజయనగర మరియు-
కాకతీయ శిల్పకళారీతులతో పాలరాతి అందమైన ముఖద్వారాలు!
అనేకవేల వినాయకుల నిమజ్జనాల వేదిక హుస్సేన్ సాగర్
బతుకమ్మపండుగ వేదికా హుస్సేన్‌సాగరే!
ప్రజల వైవిధ్య చైతన్య, అచేతనల మధ్య-
నగరం నిద్రపోదు! జనాన్ని నిద్రపోనివ్వదు.



నగరంలో-డబ్బుంటే అన్నీ సమకూర్చుకోవచ్చున్న ఆలోచన-
సబ్బుంటే అంత మురికినీ పోగొట్టుకోవచ్చున్న అనాలోచన!
కొనలేం నేడు-చిన్నచిన్న సౌకర్యాలను సైతం డబ్బుతో-
మనలేం నేడు ప్రజాస్వామ్యపు స్వేచ్ఛ పెచ్చులూడిన సమయాన!
దౌర్జన్యం నేటినాగరికత-దౌర్జన్యం రేపటిబతుకు చిత్రం!!
దౌర్జన్యాలకు, వికృతవిలాసాలకు, పెట్టుబడిదారుల కుట్ర
సమావేశాలను పొదిగే పెద్దపక్షి!
నేటి ఆధునిక ఐదునక్షత్రాల హోటల్!
నగరంలో ఖచ్చితంగా నిద్రపోనివి ఆధునిక నక్షత్రాల హోటళ్లే!
దేశ, విదేశాల, పర్యాటక, ప్రత్యేకసమావేశాల పండుగల లోగిళ్ళు!!
డబ్బుకు వెరువనివారికి, ఆనందాలకు కదలివచ్చేవారికి కనబడే ఖరీదైన నివాసాలు!!
జాతీయ, అంతర్జాతీయ, స్థానికశాస్త్ర, సాంస్కృతిక
ఖరీదైన భారీ సమావేశాలకు రాజమహళ్లు-
సుందరమైన, ఆకర్షించే నిర్మాణాలు
లోపల, గదులలోపల అలంకారాలజోరు-
కస్టమర్లకు పరుస్తారు ఎర్రతివాచీలు-తెల్లగులాబీలు-
సున్నితంగా, నొప్పితెలియకుండా, వినయంగా వంగి వంగి
అందమైన పడతులతో చేయించే సేవలకు వేస్తారు జాస్తిగా ఛార్జీలు!

ఆధునిక శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానంతో నిర్మింపబడ్డ ఈ హోటళ్లు-
ధనస్వామ్య పెట్టుబడిదారీ మేకవన్నె వ్యాఘ్రాలకు అందిస్తాయి
ఆధునికత పేరుతో అనాఘ్రాత పుష్పాలను!
రాత్రంతా నలిగి నలిగి పోయిన ఆ పూలను
తదుపరి ఉదయమే పారేస్తారు ప్రహరీ అవతలకు.
ఈతకొలనులు రోతకొలనులుగా మారుతాయి యిక్కడ.
మోత లేకుండానే రిమోట్ కంట్రోలుతో విపరీతాలు జరుగుతాయి యిక్కడ!
'సహస్రఫణ్' వెయ్యితలల (నాలుకల) రాజకీయ సర్పాలు
మెలికలు తిరుగుతూ రమిస్తాయి యిక్కడ.
పారాహుషార్! సబ్‌ఠీక్ హై!!గూర్ఖా కర్ర రోడ్డు మీద చేసే చప్పుళ్లతో
నగరం నిద్రపోదు యిక్కడ!
నగరానికి పడమరగా ఇరవై ఒకకిలోమీటర్ల దూరాన-
నగర నీటి సరఫరాకు మీర్ ఉస్మాన్ అలీఖాన్ 1920లో నిర్మించిన
అందమైన జలాశయం-**ఉస్మాన్‌సాగర్!**
దీనికి ఇప్పుడు మరోపేరు-పర్యాటకస్థలం-గండిపేట!
విశ్వవిఖ్యాత నటసార్వభౌమ, మాజీముఖ్యమంత్రి
కీ.శే.నందమూరితారకరామారావు-
ప్రతి సృష్టి కర్త-రాజర్షి విశ్వామిత్ర సినిమాను-
ఒక పిల్లహీరోయిన్ మేనకగా-తాను "విశ్వామిత్రుడు"గా
అత్యంత ప్రతిష్ఠాత్మకంగా-అన్నీ తానై నిర్మించినది గండి కోటలోనే.
ఈ సాగరం నలభై ఆరుకిలో మీటర్లకు విస్తరించి-మూసీనది నోటిని అడ్డుకుని
కట్టిన జలాశయం ఉస్మాన్‌సాగర్!
రకరకాల నిర్మాణాలతో, అందంగా తలలూపే పూల చెట్లతో-ప్రజల వినోదానికి-
నేడు-ఏర్పాట్లు చేయబడిన ఆకర్షణీయమైన పర్యాటక కేంద్రం గండిపేటచెరువు!

❋ ❋ ❋

నగరం నుండి-విజయవాడ వేళ్లే జాతీయ రహదారిలో
ఇరవై అయిదు కిలోమీటర్ల దూరాన-పరమగిరి కొండపై-
నిర్మించబడ్డ అద్భుతదేవళమే- **సంఘి గుడుల సముదాయం!**

గర్భగుడిలో–తొమ్మిదిన్నర అడుగుల శ్రీ వేంకటేశ్వర స్వామి
దివ్యవిగ్రహంతో–**సంఘి గుడి!**
పాపపరిహారార్థమో, భక్తి చిత్తముతోనో, నిర్మింపబడిన ఆస్తికులగుడి!
దూరం నుంచి చూస్తే–పరిసర ఆకాశాన్ని ఆధిగమించినట్లుగా
గుడికి–కొండపై–పదిహేను అడుగుల రాజగోపురం–
పరమగిరి కొండపైన–భక్తులను ఆహ్వానిస్తూ–అతి పెద్దమహాద్వారం–
భక్తులను మార్గదర్శనం చేస్తున్నట్లు–ఒకగుడి–
పవనపుత్రుడైన ఆంజనేయుడికి అంకితం!
చోళ–చాళుక్యుల శిల్ప కళారీతులతో నిర్మించబడ్డ
ఈ గుడుల సముదాయపు అధ్యక్షుడు శ్రీ వేంకటేశ్వరస్వామే!
నిశ్శబ్దంలో శబ్దంలా–ఇన్ని సదుపాయల రక్షణలో నగరం నిద్రపోదు
జనాన్ని నిద్రపోనివ్వదు!!



మనిషికి, జంతువుకూ అంతిమ సంతృప్తి–ఆనందం–
ఆ ఆనందం పొందుటకు నాడు–నేడు–రేపు
ఎన్నో మార్గాలు–ఎన్నో ప్రాకులాటలు–
నలుగురూ చేరి, కూర్చుని–సాహిత్య, సంగీత, శాస్త్రీయ–రాజకీయ–
సినిమా, వ్యాపార, సేవాపర–సమావేశాలకు–
వారాంతపు సెలవుల్లో–డబ్బున్న మహారాజులు సరదాగా గడిపేందుకు–
జాతీయ, అంతర్జాతీయ చర్చావేదికల నిర్వహణకు–
ధనికుల పిల్లల, స్త్రీల–ఓణీ, ఉపనయన, లుంగీ, సమర్త, వివాహ, సీమంతం
ఆ తరువాత–అన్నప్రాసన, నామకరణ ఉత్సవాలకు,
విశాలమైన హాలుతో, బహుసుందరమైన వేదికలతో–
ప్రతిధ్వనిరాని ఏర్పాటుతో–
సమావేశపు హాలులో ఆకర్షణీయంగా కుర్చీలను
మరోకంటికి నచ్చే రంగుగుడ్డలు తొడిగి–కట్టేసి–
ఎక్కడకూర్చున్నా ఒకే విధంగా వినిపించేట్లు, దృశ్యం
కనిపించేట్లు–తెరలు–ఏర్పాట్లుచేసి–!

క్రింద ఖరీదైన కార్పెట్లు పరచి–చూపరులకు నచ్చేట్లుగా–
నేడు నగరంలో–గర్వంగా–**ఐదు నక్షత్రాల ఆధునిక సమావేశ వేదికలు!!**
భారీ అద్దెలకు–యింకా–ఖరీదైన ఆహారసరఫరాలతో–
అభివృద్ధిచెందిన యితర దేశాలకు ధీటుగా–
ఐదు నక్షత్రాల ఆధునిక సమావేశ వేదికలు–
పెట్టుబడిదారీ ముద్దుపుత్రికలు!!
ప్రముఖవ్యాపార వేత్తలు, ధనవంతులు అట్టహాసంగా–
తమ అధికార, అనధికార కార్యక్రమాలను నిర్వహిస్తుంటారిక్కడ.
సూపర్ స్పెషలిస్టుడాక్టర్లు–జాతీయ–అంతర్జాతీయ సదస్సులను
మందుల కంపెనీల సహకారంతో జరుపుతారు ఇక్కడ!
పారిశ్రామికవేత్తలు–తమ తమ ఉత్పత్తులను–
ప్రదర్శననిమిత్తం–ప్రచారనిమిత్తం–వ్యాపారనిమిత్తం–
ఒకటి నుండి రెండు, మూడు రోజులు నిర్వహిస్తారు ఉత్సవాలను.
ప్రముఖ బ్యాంకులను అప్పు ప్రదాతలుగా చూపిస్తూ–
ఇక్కడ రియల్ఎస్టేటు వ్యాపారాలు–అమ్మకానికి–ప్లాట్లు,
ఇండిపెండెంటు ఇళ్లు–చేస్తారు రుణమేళాలు!
ఒక్క ముక్కలో చెప్పాలంటే–నల్లధనం మూల్గుతున్న వాళ్ల
ఇష్టారాజ్యవేదికలు–ఈ ఐదునక్షత్రాల సమావేశస్థలాలు–
వీటితో–నగరం నిద్రపోదు–జనాన్ని నిద్రపోనివ్వదు!



'మానవసేవే మాధవసేవ' అన్నారు పెద్దలు!
నేటికీ సమాజంలో అత్యున్నతస్థానం సమాజ సేవకే!
యుగాలు గడిచినా మానవచరిత్రలో నిల్చింది
శిబి, బలిలాంటి చక్రవర్తులే!
మదర్ థెరిసా; మహాత్మాగాంధీలే!!
సమాజ హేళనకు గురై–
కుష్ఠువ్యాధికి బలైనవారి పాలిటి వరం
కూకటపల్లిలోని **శివానంద పునరావాస కేంద్రం!**

'హైదరాబాదు నగర ప్రథమ మహిళా మేయరు
కీ.శే.శ్రీమతి కుముదినీ దేవి స్థాపించిన సేవాదేవళం!!
'భారతరత్న' సేవాతత్పరతామూర్తి కీ.శే.మదర్ థెరిసా సందర్శించిన
కుష్ఠ, క్షయ, హెచ్ఐవి/ఎయిడ్సు రోగులకు గత
యాభై, సంవత్సరాలకుపైగా సేవలందిస్తున్న సంస్థ!
కుటుంబంవదిలేస్తే-మిగిలిన సమాజం తోసేస్తే.
క్షయ, కుష్ఠ, హెచ్ఐవి/ఎయిడ్స్ రోగులు అక్కు పక్షుల్లా చేరితే-
ఆదరించి-సేదతీర్చి-సేవచేసి-
రోగాన్ని నయంచేసి-రోగంవల్ల కల్గిన అంగవైకల్యాన్ని సరిచేసి
పునర్ నిర్మాణ శస్త్రచికిత్స (Re Constructive Surgery)
పునరావాసం కల్పించి-ఉచితంగా అన్ని సౌకర్యాలు కల్గిస్తున్న సేవాసంస్థ
శివానందపునరావాస కేంద్రం!
తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలకు కలిపి-ఉమ్మడిగా వున్న
ఏకైక పునరావాసకేంద్రం-శివానంద!
అక్కడి రోగుల్ని చూసి-వారి కుష్ఠను నయంచేసి-
గాయాల్ని కడిగి-కట్లుకట్టి-
కుష్ఠవ్యాధి వల్ల(కల్గిన) అంగవైకల్యం సంభవిస్తే-
పునర్నిర్మాణ శస్త్రచికిత్సలను ఉచితంగా చేస్తున్న-
నిస్వార్థ సేవాపరాయణుడు డా॥ఎ.బొ.బెయిని (జర్మనీ దేశస్థుడు) -
కీ.శే.పి.హృశీకేష్‌గారి నాయకత్వంలో-
నడుస్తున్న శివానందపునరావాస కేంద్రం!
రోగుల సేవలకు అంకితమై వైవాహిక జీవితాన్ని వదులుకున్న సన్యాసినర్సులు-
'నీ కులం ఏమిటంటే-కుష్ఠ కులమని చెప్పే-పునరావాసం పొందిన రోగులు-
వారిబాగోగులను చూస్తూ గౌరవవేతనాలకే పనిచేసిన డా॥నాగినేని భాస్కరరావు,
పనిచేస్తున్న డా!ఎస్.అనంతరెడ్డి గారలు
పెద్ద వెల్డింగ్‌వర్కుషాపు, చేనేత మగ్గాలు, కొవ్వొత్తులతయారీ విభాగాల్లో పనిచేస్తూ
వైకల్యాన్ని విస్మరించి-దొరికిన తోడునే-జీవితపు జోడుగా ఎంచుకుని-
జీవించే పునరావాసరోగులు-
నిజమైన ఉచిత సేవలు పొందుతున్న కుష్ఠ, క్షయ, ఎయిడ్సురోగులతో

శివానంద పునరావాస కేంద్రం!
చూడామణి వృద్ధాశ్రమము కూడా అక్కడే
కేవలం మహిళల కోసం నడుపబడుతున్నది.
ఇరవైనాలుగు గంటలు మేల్కొనే నగరం నిద్రపోదు!
జనాన్ని నిద్రపోనివ్వదు!



నగరంలో చార్మినార్ కట్టడానికి కుడివైపున 'ప్రేమవీధి'గా-ప్రసిద్ధికెక్కిన
నగరంలోని పురాతనదుకాణాల కేంద్రాల్లో ఒకటి **లాడ్‌బజార్!**
కోలాహలంతో నిండి వుండే ఈ వీధుల్లో-కాంతులీనే దుకాణాలు
సంప్రదాయ గాజులు, పెళ్లికూతుళ్ల వస్త్రధారణలు
హీనా Heena అలంకార సామగ్రి లభిస్తాయిక్కడ-
పాతనగరం గుండెల్లో వుండే ఈ లాడ్‌బజారును అందరూ తప్పక చూడాల్సిందే!
లాడ్‌బజారంటే లబలబలాడక సంబరపడతారు పడతులు-
దీని ప్రక్కనే మరెన్నో దుకాణాల సముదాయాలు-
చార్‌కమాన్, మిట్టి-కా-షేర్‌లు-
ఇవి-కుందన్‌లో పురాతన నగలకు,
ఎనామెల్ పాత్రలకు-పాతబీద్రి, అందమైన...
వెండి, స్ఫటికాలు మరియు ముత్యాలకు ప్రసిద్ధి!
భారత తీపి వస్తువులకు మరియు బీద్రివస్తువులకు-
అలంకరణకోసం-
అతి పల్చని వెండి ఆకులకు ప్రసిద్ధిగాంచిన దారుష్-షిఫా పాత నగరంలోనే
ఎత్తైన చార్మినార్‌కు దగ్గర్లోని
లాడ్‌బజారుకు ఎడమవైపున వున్నది-చౌమల్లా పాలెస్!
ఆసఫ్ జాహీల పురాతన రాజమందిరం ఇది-
ఖిలావత్ కాంప్లెక్సు లేక ఖిలావత్‌మహల్‌లు దీని యితర పేర్లు-
జీవ వ్యాపారాలతో పాతనగరం కూడా నిద్రపోదు-జనాన్ని నిద్రపోనివ్వదు!



అద్భుత మహానగరంగా గణుతికెక్కి-
నాలుగువందల ఏళ్లకుపైగా చరిత్రలో నిలిచి-
రాజులు, జమీందారులు, నవాబులు దొరలు గీచిన గీతల్లో నడచి, నడచి-
అరవై సంవత్సరాల పాలనలో నలిగి, నలిగి-
'ఏడాదిన్నర క్రింద స్వేచ్ఛాయుత తెలంగాణ రాష్ట్రంగా అవతరించి-
అంతరాన మండుతున్న సమస్యలతో-అంచుల్లో ఆనందాలను పంచుతున్నట్లు-
సౌకర్యాలను మించిన అసౌకర్యాలతో-అనునిత్యం-ఆకలి,
అజీర్తుల మధ్య జనాలతో-
తొలి తెరాస ప్రభుత్వం అందించిన నిరంతర విద్యుత్తుతో-
29-11-2015నాడు నగరంలో ప్రవేశించిన గోదావరి నీటితో-
నిత్య చైతన్యంతో, పోరాటాలతో నగరం ఎప్పుడూ-గరం-గరం-
అధునాతన విజ్ఞానము-అంతులేని అగాథాలతో-ఫకీరు-నవాబుల్ని
తలపిస్తూనగరం-
నగరం ఎప్పుడూ నిద్రపోదు-జనాన్ని నిద్రపోనివ్వదు!.....
సిమెంటు గూళ్లలో-కార్లున్నా-యింకాతొలగని నీటి కష్టాలు.
జనానికి నగరమంటే మోజు-వస్తారు నగరానికి రోజూ-
పల్లెల్లో అదిరించి, బెదిరించి సంపాదించింది చేస్తారు నగరంలో
ఖర్చు-లాడ్జీలకు-యితరసరదాలకు-
తెలిసిన-నగరం ఒక చలాకీ, చంచలజీవితమని-
తెలిసినా-నగరం ఒక ఉరుకుల, పరుగుల వేగపు జీవితమని-
తెలిసినా-నగరం పై ,పై మెరుగుల-లోలోపల లొట్ట బ్రతుకని-
చదువు కొనుక్కోవటానికి-చదువు నేర్చుకోవటానికి విద్యార్థులు-
గుంపులు, గుంపులుగా ముఠాలుగా-కంట్రాక్ట్ ద్వారా వస్తారు
వలస కూలీలు తక్కువకూలికి!
గంపెడాశతో-నాయకుల వాగ్దానాలపై ఉంచుకున్న నిరుద్యోగ యువత-
గడ్డాలు, మీసాలు పెంచుకుని-కుటుంబాన్ని వదలి-
మరో ఉద్యోగానికి చిరుద్యోగులు-

ఛోటా, మోతానాయకులు–పైరవీలకోసం–
ధర్నాలకు–ప్రతి పక్షాల పిలుపుమేరకు–
పోగేసిన జనంతో వాటి ఉపసంఘాల నాయకులు–
లక్షలాది సంఖ్యలో రోజూ చేరుతారు నగరానికి వివిధ వాహనాలపై!
నగరంలో–రోజూ నీరురాని పంపులు–
ప్రకటనల్లో కన్పించి–హాల్లో ప్రత్యక్షం కాని సొంపులు–
తెచ్చినడబ్బు నాలుగు చక్రాల బండిపై ఫలహారాలు, భోజనాలకు సరిపోతాయి–
విపరీతంగా–నగరం నలుమూలలా–పెరిగిన అపార్టుమెంటు సిమెంటు గూళ్లలో–
ఏదో కారణాన–నీరు రాక–కరెంటు లేక బాధపడే నివాసుల్ని చేరి–
ఆ దుస్థితిని కళ్లారాచూసి, చెవులారా విని–
బంధు, మిత్రులు చెవులు జాడించుకుని–
పడతారు తిరుగుముఖం–గ్రామాలకు! తిడతారు సాకారం కాని నగరజీవితాన్ని!
పల్లెలో చెట్ల గాలైనా దొరుకుతుంది–తింటానికి దొరుకుతుంది ఆహారం కొంతైనా–
తిట్లు తినే నగరం నిద్రపోదు–జనాన్ని నిద్రపోనివ్వదు!



## 'ప్రపంచ వారసత్వ ప్రాంతం'గా
## తెలంగాణ రాష్ట్ర రాజధాని హైదరాబాదు నగరం!

'హైదర్ ఆబాద్'?– హైదర్ బాగున్నావా?
'సికిందర్ ఆబాద్?'–సికిందర్ బాగున్నావా?
పలుకరింతల ఫలితంగా అన్నట్లు–హైదరాబాదు, సికిందరాబాదు–జంటనగరాలు!
వాటిమధ్య సుందరంగా వెలసిన హుస్సేన్ సాగర్–
అందులో ఆశీర్వదిస్తూ ఏకశిల బుద్ధుడు!
భవిష్యత్తులో–హుస్సేన్ సాగర్ చుట్టూ రాబోయే–ఆకాశ హర్మ్యాలు
మెట్రోరైలు– ఫార్మాసిటీ–గోదావరి, కృష్ణాజలాలు–
నాలుగు వందల ఏండ్ల చరిత్ర కలిగిన పురాతన నగరం
గడించింది ఎంతో ప్రపంచఖ్యాతి!
నాటి నిజాంప్రభువుల కాలం నుండి–

నేటి -తాజా-ఆంధ్రా వలసపాలననుండి-
వీర తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటాలు
తెలంగాణ రాష్ట్ర సాధన పోరాటాలవరకు-
నిలువెత్తు సాక్షిగా నిలిచి-నిండుగా అభివృద్ధిని సాధించిన హైదరాబాదునగరం-
నాటి తెలంగాణకూ రాజధాని హైదరాబాదునగరం-
నీటి కొరత లేని నగరం అప్పుడు-
02-06-2014న భారత దేశానికి ఇరవై తొమ్మిదవ రాష్ట్రంగా అవతరించిన
తెలంగాణకూ రాజధాని హైదరాబాదు!
ఆంధ్రా వలసపాలనలో అస్తవ్యస్తమైంది
నీటికి కటకటలాడుతున్నది...విద్యుత్తుకు వెతలుపడింది-
ఇప్పుడు తెలంగాణ తొలి ప్రభుత్వం తెరాసది
వెంటనే తీర్చింది కరెంటు కష్టాలను-గోదావరిని నగరానికి తెచ్చింది!
'మిషన్ కాకతీయ'తో వ్యవసాయానికి-తాగునీటి కొరత తీరబోతున్నది-
అంతర్జాతీయ స్థాయి కెదిగిన నగరం-భాగ్యనగరం!
బతుకమ్మపండుగ, మొహర్రం, క్రిస్టమస్ పండుగలు అధికార పండుగలయ్యాయి!
మత సామరస్యానికి నగరం మచ్చుతునకైంది!
విద్యకు, వైద్యానికి, సాఫ్ట్‌వేర్ టెక్నాలజీకి చిరునామా అయింది.
ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన డా॥ నాగేశ్వరరెడ్డి ఏషియన్‌గాస్ట్రో ఎంటిరాలజీ సంస్థ-
అంతర్జాతీయ స్థాయిలో రామోజీ ఫిల్మ్‌సిటీ-
నాలుగుశతాబ్దాల చరిత్రగల చారిత్రాత్మక చార్‌మీనార్ కట్టడము.
ఉస్మానియా యూనివర్శిటీ, పి.వి.నరసింహారావు ఆకాశమార్గము,
యూనివర్శిటీ ఆఫ్ హైదరాబాదు-
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయము, రవీంద్ర భారతి,
ఆసియా ఖండంలో పెద్దదైన మహాత్మాగాంధీ బస్‌స్టేషన్
విశ్వవిద్యాలయంగా స్వతంత్ర ప్రతిపత్తి కల్గిన నిజాంకాలేజి-
ఒకప్పుడు 'బొక్కల దవాఖనా'గా పేరొంది-నేడు నిజాం ఇనిస్టిట్యూట్ ఆఫ్
మెడికల్‌సైన్సెస్ (Nims) విశ్వవిద్యాలయం-
సుల్తాన్ బజారులో తెలుగు భాషాభివృద్ధికి, గ్రంథాల యోద్యమానికి
ఎనలేని సేవలందించిన శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయం,

రాష్ట్రపతి దక్షిణాది రాష్ట్రాల పర్యటనకు వచ్చి బసచేసే బొలారంలోని
రాష్ట్రపతినిలయం-
నగరంలో నలువైపులా-వాల్జడవిరబోతలా విస్తరించిన హైదరాబాదులో-
ప్రసాదు ఐ-మాక్సుథియేటర్సు,
యన్.టి.ఆర్. గార్డెన్సు, సికిందరాబాదు పెరేడ్‌గ్రౌండ్స్, ఆబిడ్స్‌లో నెహ్రూ
విగ్రహం, గోల్కొండకోట-
సుల్తాన్ బజారులో మహిళా విశ్వవిద్యాలయ కళాశాల, కోఠీలో రాష్ట్రంలో అతి పెద్ద
పురాతన ఉస్మానియా వైద్యకళాశాల- అఫ్జల్‌గంజ్‌లో రాష్ట్రంలోనే నెలకొన్న
అదిపెద్ద, పురాతన ఉస్మానియా వైద్యశాల, ఆపక్కనే హైకోర్టు-
రాష్ట్ర గ్రంథాలయం, రాజీవ్ గాంధీ శంషాబాదు విమానాశ్రయం, ముషీరాబాదులో
గాంధీ వైద్యకళాశాల మరియు గాంధీజనరల్ వైద్యశాల-
ఇంకా LV ప్రసాదు కంటి ఆస్పత్రి, అన్నపూర్ణ స్టుడియో-
ప్రసాదు కలర్ లాబోరేటరీలు, ఫిల్మ్‌నగర్-
అపోలో ఆస్పత్రి, కేర్ ఆస్పత్రి, అసెంబ్లీ భవనాలు, తెలంగాణ అమరవీరుల స్థూపం
గవర్నమెంటు ఛాతీ మరియు జనరల్ ఆస్పత్రి,-
నగరకిరీటపు ధగధగలు? వీటితో పాటు-
తెలంగాణ రాష్ట్ర తొలి ముఖ్యమంత్రి గౌ॥శ్రీ కల్వకుంట్ల చంద్రశేఖరరావుగారు-
బంజారా భవన్‌లను, గిరిజన భవన్‌లను నిర్మించాలని సంకల్పించటం-
అమరవీరులు కొమరంభీం భవన్, కొమ్రేడ్ దొడ్డి కొమరయ్య భవన్‌లను
నిర్మించాలనుకోవటం కడు ప్రశంసనీయం
తెలంగాణ సాధనలో అసువులు బాసిన అమరవీరులకు
నిర్మించిన స్థూపం నగరానికి తలమానికం!
తెలంగాణ ప్రజల గుండెల్లో-హైదరాబాదు నగరానికి ప్రథమస్థానం వుంది-
'హైదరాబాదు బిరియానీ'కి నగరం పుట్టినిల్లు! దాని రుచులకు
జిహ్వాజిల్లు-జేబుకవుతుందొక భారీబిల్లు!
దానికితోడుగా-నేడు తెలంగాణ రుచులందించే ఆహారశాలలు
వెలిసాయి నగరంలో!
నగరం నూతన హంగులతో, సొంపులతో-సుఖాలతో నిద్రపోదు-
జనాన్ని నిద్రపోనివ్వదు!!

# బతుకు సమరంలో....నగరంలో....

ఇప్పుడు-నగరంలో జీవితం సగర్వంకాదు-
ఇప్పుడు-నగరంలో జీవితం పెక్కు కష్టాల పర్వం
వాతావరణ-ఘన, ద్రవ, వాయు కాలుష్యాల మధ్య
పరిశ్రమలు విడుదలచేసే కాలుష్యాల కొరల్లో-
రోడ్లపై నడుస్తున్న ప్రభుత్వ, ప్రైవేటు వాహనాల
వాయు, శబ్ద కాలుష్యాల మధ్య-
ఉత్తమస్థాయి డ్రైనేజి సౌకర్యాల లేమితో-నీటికాలుష్యం మధ్య-
వర్షం కురిస్తే చాలు-వరద మధ్య-
వాహనాల రాకపోకల అంతరాయంతో నలిగిపోతూ-
అరకొర నీటి సౌకర్యంతో-అవస్థపడుతూ-
పగటి జీవితంలోనూ, రాత్రి జీవితంలోనూ
అధికభాగం ప్రయాణం ప్రయాసలతో-
అస్థిర ఆదాయంతో స్థిరమనస్సులేక-నిరంతర అస్థిమిత ఆలోచనలతో-
అవనిపై నిలబడి-ఆకాశం కేసి చూస్తే కనిపించని ప్రకృతి మధ్య-
అలసి సొలసిన శరీరం-అనుభవానికి రాని సంసారం!
చెట్లు, చేమలు కనిపించవు
సిమెంటుగూళ్లు, సిమెంటురోడ్లు తప్ప! అంతా "కాంక్రీటు జంగిల్"-
సహజసిద్ధమైన గాలి, నీరు, ఆహారం లభించవు-
కల్తీనీరు, కాలుష్యమైనగాలి-
కల్తీలతో ఆహారం తప్ప!
కాగితంపై పెరుగుతున్న వయస్సు
కన్పించే కాయం వయస్సుకు ఎంతో అంతరం!
వయస్సుకు మించిన పనిభారం
పనిభారానికి సరికాని ఆదాయం!

కన్పించే మేడలు-వాటి వెనుక కానరాని కష్టజీవుల జాడలు!!
పెట్టుబడి పెత్తనం కాటేస్తే-యింకా కన్ను తెరవని సామాన్యులు-
సీజనల్ వ్యాధులకు-వృత్తిలో వచ్చే జబ్బులు
ఆహారలోపంవల్ల కల్గే రోగాలకు-బలయ్యేవాళ్లు-కోకొల్లలు-
గ్రామాలనుండి, చిన్న పట్టణాల నుండి
జబ్బుల్తో నగరానికి తరలివచ్చే దీర్ఘవ్యాధులరోగులు-
వచ్చి-"దూరపు కొండలు" అని తెలుసుకున్న వాళ్లే!
వచ్చిన వాళ్లు-నగరంలోని వివిధ ప్రభుత్వ, ప్రైవేటు ఆస్పత్రులపాలు!
తెచ్చిన డబ్బులు సరిపోక-ఊళ్లోవున్న వారి ఆస్తుల అమ్మకం ఆఖరిఅంకం!
ఆ తరువాత కాటికాపరి సుంకం
నగరం లొసుగులు, మోసాలు, మోహాలు తెలియని వాళ్ళు-
ఇప్పటిదాకా వలసపాలనకు గురై గిలగిల కొట్టుకుంటున్న వాళ్లు-
నిద్రపోని నగరాన్ని
సమగ్రంగా, సమూలంగా పునర్నిర్మించటానికి-
సహజత్వానికి దగ్గరగా జీవితాన్ని సరిదిద్దటానికి-
అవినీతి, అలసత్వం, అక్రమం, అన్యాయం, అరాచకం, అత్యాచారాలను-
ఆచూకీ లేకుండా చేయటాన్ని అహర్నిశలు పాటుపడే ప్రభుత్వం-
అందరి క్షేమం ధ్యేయంగా-అర్హులందరికీ డబుల్ బెడ్‌రూం ఇండ్లు-పింఛన్లు-
అందరికీ రక్షిత నీటి సౌకర్యం-మెట్రోరైళ్ల మార్గాలు-
జిల్లాలకు విమానసౌకర్యం-పొలాలకు సాగునీరు-
అందరికీ ఆరోగ్యమేమహాభాగ్యంగా
ప్రతి జిల్లాకొక మెడికల్ కాలేజీని-వెయ్యిపడకల ఆస్పత్రిని-
అందుబాటులోకి తేవటాన్కి కంకణం కట్టుకున్న
కొత్త తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం!
పవిత్ర గోదావరినది పుష్కరాలను
విజయవంతంగా నిర్వహించిన ప్రభుత్వం-
ప్రజాసేవే పరమావధిగా

చిత్రనగరి, పారిశ్రామిక సంస్థలు,
ఉద్యోగుల, మైనార్టీ, గిరిజన, దళిత సంక్షేమం కోసం-
కొత్త కొత్త సౌకర్యాలు కల్పిస్తున్న కొత్త ప్రభుత్వం
ముఖ్యమంత్రి గౌ॥శ్రీ కల్వకుంట్ల చంద్రశేఖరరావుగారి సారథ్యంలో-
నగరంలో జీవితం నరకం కాదని-
నగరంలో జీవితాన్ని 'నాకం'గా చేయటాన్కి-
అందరి పాత్రా అవసరమని-నగరం ఘోషిస్తోంది-
నవజీవనానికి నాంది పలకాలని ప్రజలూ యోచిస్తున్నారు-
**అన్నిభాషల, అన్ని రాష్ట్రాల, అన్ని వర్గాల నిలువెత్తు సంతకం నగరం!**
సదా జీవచైతన్యంతో నగరం నిద్రపోదు-జనాన్ని నిద్రపోనివ్వదు!!

*రచనా కాలం: 29-11-2012 రాత్రి 11.25 ని॥ నుండి*
*12-12-2015న ఉదయం 3 గం॥ల వరకు.*

***

డా॥ నాగినేని భాస్కరరావు రచనలు




Writing by Dr. Nagineni Bhaskara Rao







1. మేం - (సుధామతో కలిసి) - 1974
2. దేశం కోసం శాస్త్రవిజ్ఞానం - 1988
3. ఆక్సిజన్ - 1991
4. సమాజ శిల - 2000
5. వ్యక్తిత్వ వికాసం ఆరోగ్య సూత్రాలు - 2001
6. నవజీవనం - 2003
7. నిప్పుకోడి - 2006
8. భయం మేల్కొనే వుంది - 2008
9. వృద్ధులు - ఆరోగ్యం - 2013
10. చారవ - 2016
11. నగరం నిద్రపోదు (దీర్ఘ కవిత) - 2016























నగరం నిద్రపోదు (దీర్ఘ వచన కవిత) డా. నాగినేని భాస్కరరావు

**NAGARAM NIDRAPODU** A Long Free verse

by **Dr. Nagineni Bhaskar Rao**

"నగరంలో జీవితాలు పలురకాలు -
నగరంలో జీవితాలు ప్రక్కవాళ్ల పలుకరింతలు లేనివే అన్నీ!
నగరంలో జీవితాలు నయాపైసా నావపైనే నడుస్తాయి-
పైసాలేని వాడు - నగరంలో ఒక నికృష్ట జీవి
-కండా, చర్మంలేని ఒక అస్థిపంజరంలాంటి మానవాకారం!!"



**యువభారతి:** తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు
తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001